# భీష్మునిచరిత్ర



మంగిపూడి పురుషోత్తమశర్మచే

వ్రాయఁబడినది.

౧వ కూర్పు.



రాజమహేంద్రవరము :

శ్రీ అద్దేపల్లి లక్ష్మణస్వామినాయఁడుగారి
సరస్వతీ పవర్ ప్రెస్సునందు ముద్రింపఁబడియె.

౧౯33.



[ వెల రు ౦—౧౨—౦

# విజ్ఞప్తి

సహృదయులారా!



ఇది చారిత్రక విమర్శగ్రంథముగ నుండవలె నని మాతలంపు గాదు. ఆంధ్రమహాభారతమున గీర్తింపఁబడిన విధమున నీ వీరశేఖరుని పూజ్యవర్తనమును వర్ణించుటయే మా ముఖ్యోద్యమము.

గ్రంథమునకు వన్నె వచ్చుటకును, భారత కవితామృతమును సామాన్య పాఠకునకుఁ జవి చూపి యా కావ్యపఠన కౌతూహలమును బురికొల్పుటకును, భారతమునుండి యందందు పద్యరత్నములను ధారాళముగ నుపయోగించితిమి. మఱియు నా యా పద్యములు సుబోధము లగునట్లు లఘుటీక కూడఁ జేర్చితిమి.

శ్రీ భీష్మాచార్యుని జీవనవిధానమును గ్రహించుట కిందు గొంతవఱకుఁ బ్రయత్నింపఁబడినది. ఎంతవఱకు కృతకృత్యుల మైతిమో? ఇందలి రచనావిధమునఁ గాని, ధర్మనిర్ణయవిషయమునఁ గాని పొడకట్టు లోపములను దయాళువులై తెలిపినచో వందనములతో నందుకొందుము.

ఇట్లు,
బుధజనవిధేయుఁడు,
గ్రంథకర్త.

---

# నివేదనము.

ఓ జననీ! భారతమాతా !!

తొల్లి నీవు నీ విజ్ఞానముచే, వీర్యముచే, ఆశ్రితావనముచే కీర్తిమహోన్నత శిఖరము నధిష్ఠించితి వనియు, నీ యసదృశ తేజఃప్రసారమే యశేషమహీజనజీవితంబులను చిరకాలముగ ప్రకాశవంతములుగను పావనంబులుగను గావించుచున్న దనియు, నీ శ్రీమద్గర్భావిర్భూతులగు పుత్రరత్నంబులు జగదారాధ్యులనియు పవిత్రవర్తనులనియు నీ యీ సురుచిరోషసీ సమయంబున ప్రాంతోద్యానవనంబుల నానాశకుంతసంతానంబులవ్యక్తస్వనంబున నొనర్చు సుమధురగానంబులు దీర్ఘనిద్రాశుష్కంబులగు మాశ్రవణపుటంబులం జొచ్చి మమ్ములను ప్రబుద్ధమానసులుగఁ జేసినవి.

తల్లీ! మే మింక మఱల నిద్రాసక్తులము గాఁజాలము. మా బిఱుసు ముసుఁగులం దొలఁగఁదీసి ఉదయాద్రినుండి భానుమంతునివలె లోకమునంతకుఁ దొంగి చూచుచున్నాము. మహోజ్జ్వల ప్రాచీనచారిత్రవు లోకపావనివి పూజ్యురాలవు నగు నీ శుభాంకితలమున పుత్రులమై యవతరించినందులకు మేము నిశ్చయముగా గర్వముతో నుప్పొంగుచున్నారము.

అంబా! సుప్తమోహమున నయరాని యపరాధము లెన్నియో నీయెడఁ జేసినారము. నీవిజ్ఞానమును వ్యర్థమంటిమి. నీ వీరకుమారులను విస్మరించితిమి. నీ సంపత్తిని తృణీకరించితిమి——ఇఁక నేల? పసిన పాపము చెప్పిన పోవును గదా!— నిన్ను తూలనాడితిమి! హేళన మొనర్చితిమి. పరవీరులఁ బ్రశంసించితిమి. పరగురువుల పాలఁ జేరితిమి. అన్యాధర్మముల నవలంబించితిమి. స్వధర్మమును మఱచి పరధర్మము నకై పంచెపఱచితిమి. కాని యెంతకాలము పరభృతులమై జీవింపఁగలము! పరులా! తన్ని వేయఁదొడఁగిరి! పరాన్నమా జీర్ణింపదయ్యెను మా దేహాత్మలు క్రమముగా కృశింపుచు నూతనవ్యాధిబాధితములు కాసాఁగెను. మాబుద్ధులు వెఱ్ఱితలలు వేయఁదొడఁగెను. సరియైన తెన్ను దొరుకదయ్యెను. సర్వమును ప్రళయమునే సూచింపుచుండెను. ముల్లు పుచ్చి కొఱ్ఱడచుకొన్నవారమైతిమి. అయితే నొనర్చనగాని నచ్చదుగదా!

అ. పరులతల్లి పెట్టు పరమాన్నమునకన్న । కన్నతల్లి పోయు గంజి మేలు,
పాలు పంచదార చాలగా లేకున్న । నమరు ప్రేమయనెడు నమృతరసము.

అన్న పరమసత్యము ననుభవపూర్వకముగ నేడు నేర్చుకొంటిమి.

శ్లో. శ్రేయాన్ స్వధర్మో విగుణః । పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః । పరధర్మో భయావహః.

అను గీతావాక్యమును పునఃపునః మననము చేయుచున్నాము. తల్లీ! ఇఁక నీ పాదాంబుజములనే నమ్మితిమి. ముమ్మాటికిని నమ్మితిమి.

ప్రియజననీ! ఇట్టిశుభదినమున నీ యాంధ్రకుమారుల మగు మేము మాయాననములు పావనములగునట్లు, మాయాత్మలు ప్రఫుల్లములగునట్లు దశదిశలు ప్రతిధ్వనించులాగున మా త్రికోటికంఠస్వనములతో నీ చిరతరఖ్యాతిని కీర్తించుటకంటె మా కాద్యకర్తవ్య మేమికలదు? ఏమహనీయుల జన్మకారణమున వీరరత్నఖని వనియు, ధన్యచరిత వనియు జగద్విఖ్యాతకీర్తివై విలసిల్లుచున్నావో, ఏమహోదారులు తమ యుదాత్తచారిత్రములచే శాశ్వతజీవులై తేజోమయాకృతులతో నీ యాకాశమున లక్ష్యభూతులగుచున్నారో, ఏమహిమోపేతుల విశుద్ధవీర్యశోణితము మా యార్య రక్తనాళములయం దనునిమిషము ప్రవహించుచు మా కుజ్జీవనప్రదమగుచున్నదో అట్టి నీయనుంగుపుత్రరత్నముల పుణ్యవృత్తములను ధ్యానించుటకంటె, అనుకరింప యత్నించుటకంటె మాకు విధాయకధర్మ మెయ్యది కలదు? ఓమాతా! నీ పదధ్యానముచే, నీ పాదసేవచే ధన్యజన్ములము కాఁదలఁచిన మాయుద్యమము నాశీర్వదించి మమ్ముల నుద్యదుత్సాహులుగ నొనరింపుము. ఓజననీ! ఇదె నాయల్పోపహార మందికొనుము. నీ పవిత్రచరణకమలములసన్నిధి నుంచుచున్నాఁడను. ఇయ్యది యవిదగ్ధరచనయయ్యు నీ ప్రియ వీరకుమారరత్నము పవిత్రోదంతమగుటను, భక్తిసమర్పితం బగుటను ,, భవదీయాదర లేశంబునకు భాజనంబు కాకపోవునే, పరమేశ్వరుండు పత్రిచె పరిప్రీతుండగుటలేదే'' యను నిశ్శంకవిశ్వాసంబున నిశ్చలచిత్తుండనై సమర్పించుచున్నాఁడను.

---

# భీష్మునిచరిత్రము

## ప్రథమాధ్యాయము

### జననము

కురుదేశాధీశ్వరుం డగు శంతనుం డొకనాడు సశరశరాసనుండై మృగయావినోదంబునం దగిలి గంగాప్రాంత వనాంతరంబులం దిరుగాడు చుండెను. ఆతఁడు కొండొక మృగముచే నాకృష్టుండై తద్గ్రహణ కౌతుహలాతిరేకంబున నిజపరిజనంబును దిగనాడి దవుదవ్వులకు దానిం దఱుముచు నెట్టకేలకు దైవయోగంబున గంగాతీరంబున కరుదెంచెను. గంగాస్రవంతి సముచ్చల త్తరంగ మాలికలచే నాతని నాహ్వానించుచు, నిర్ఘోషంబున స్వాగత గీతికలం బాడుచు, నిజపయశ్శీకరశీతలంబులగు సమీరసంహతులచే వీజనము సేయుచుండెను. ఆతండును దీర్ఘగమ నాయాసంబును చండాంశుతాపంబును నపనయింపం గోరి తత్పులిన తలంబున విహరించుచు నాతరంగిణి సహజ శోభావలోకనంబున నరణ్యా శ్రమంబు విస్మరించి యానందవీచికలం దేలియాడుచుండెను.

ఇంతలో నొక్క కాంతారత్న మాతని కన్నుల కట్టెదుట గానవచ్చెను. త్రిజగన్మోహిని యగు నా యువతీమణి సౌందర్య విలాసముల కెంతయు నబ్బురమందుచు కంపితచిత్తంబున నాపెం జేపట్టిననే కాని తన జన్మము ధన్యముగాదని తలపోసెను. ఆ యం గనయు, దనచెంగట పురుషపుంగవుని సోయగంబున కోటువడి తర ళేక్షణయై నిలువంబడెను. లజ్జావనతుం డగు శంతనుండు స్తబ్ధుం డయ్యెను. ఐనను గంగి యాతని మనోభావంబును గుర్తెఱింగి వాతెర

విప్పి మందమృదూక్తుల నిట్లని హెచ్చరించెను. "ధరణీరమణా! నన్నుం బరిణయ మాడఁ గోరుదువేని నొక్క సమయంబు సేయుము చెప్పెదను. నే నెద్దియేనిఁ గావింప నెంచిన నడ్డు సేయరాదు. మఱియు నన్న ప్రియంబులు వలుకరాదు. ఇంతకు నంగీకరింతువేని నీకు భార్యనై యభిమత సుఖంబు లొనరింతు. ఎప్పుడైన నన్ను నొవ్వనాడినచో నప్పుడుననే నిన్నుం బరిత్యజించి పోవఁగలదాన." శంతనుం డీ పలుకుల కెంతయు నలరి సమయంబున కొడంబడి యాపెం బరిగ్రహించి యిష్టోపభోగంబుల సుఖించుచుండెను.

కొన్నాళ్ళకు గంగ గర్భవతియై యొక పుత్రునిం గనియెను. కాని యాపె యేలొకో యవమతియై యా పాపనిం బట్టి గంగపాల్వేసెను, ఇట్లేమఱి యార్వుర నిసుంగులం గని యా విచిత్రచరిత నిర్దయురాలై గంగాగర్భంబున వారిం గలుపుచు వచ్చెను. ఇయ్యధర్మాచరణం బనిష్టం బయ్యు నా రాజేంద్రుఁడు తన మనోహారిణి తన్నెక్కడ వీడునో యను భయంబున నెదురాడ నోడుచుండెను.

అంతం గొన్నినాళ్ళకు నష్టమగర్భంబున మఱల నొక మోహనాకారుం డగు మగశిశు వుదయించెను. శంతనున కెంతయో సంతసం బయ్యెను. కాని శిశుఘాతిని యగు పత్నివలన నబ్బాలకున కపాయంబు రాకుండునే యని యెంచి పుత్రమోహంబున హానవోద్యుక్త యగు నవ్వనితం గాంచి "ఓసీ? గొడ్డురాలా? ఎన్నియో పున్నెంబు లొనర్చినం గాని పుత్రసంతానంబుఁ బడయరాదు. అట్టి కొడుకుల నిదివరకే పలువురం బట్టి రాక్షసవృత్తిని నీ పొట్టం బెట్టికొంటివి. ఛీ! హాతాత్మా! నీ ఘాతుకకృత్యంబునకు మాత్రమే నిఁక నోడఁబడఁజాల. ఈ బాల సూర్యతేజుం డగు బాలుని నీవు వధింప వలనుపడదు." అని పరిపరి భంగుల నప్రియంబులు వలికి వారించెను. ఆపెయు తొల్లి యాతఁడు చేసిన సంకేతంబుఁ దలంచి యిట్లనియె.

"నీతోడ సాంగత్యము నాకు నేటితో సరి. నేను పుణ్యజలంబులచే త్రిభువనపావని యనం బరగిన గంగను సుమీ! ఈ వసువులు వసిష్ఠ శాపంబునం బుట్టుచుండి 'మే మన్యగర్భంబున జన్మింప నోపము. నీయందే పుట్టెదము. మర్త్యంబునఁ జాలకాలం బుండకుండ మమ్ము ముక్తులం జేయు' మని నన్నుఁ బ్రార్థించిన దేవహితార్థంబు మనుష్య స్త్రీరూపంబు దాల్చి నీవలన వారికి జన్మకారణంబ నైతిని. దీనిచే నీకు పుణ్యలోకంబు లక్షయంబు లగును. ఈ యష్టమపుత్త్రుండు వసువులయం దొక్కొక్కరి చతుర్థార్థంబులు దాల్చి సకల ధర్మమూర్తి యయి పుట్టినవాఁడు. లోకహితార్థంబుగా మర్త్యంబునం బెద్దకాలం బుండగలడు." అన్నంత శంతనుం డాశ్చర్యమగ్నమానసుండై "వసువులు లోకవంద్యులు. వసిష్ఠుం డేల వారికి శాపం బొసంగె? మఱియు నెల్లవసువులు పుట్టుచునే స్వర్గంబున కఱుగుటయు, నీయష్టముండు మాత్రము మర్త్యుండై చాలకాలం బుండుటయు నేమి కారణం" బని యడిగెను. గంగయు నాదరాయత్తయై యిట్లనియె. రాజేంద్రా! మున్నొకదినంబున నష్టవసువులు భార్యాసహితులై క్రీడార్థము వసిష్ఠు నాశ్రమంబునకుం జని యం దాతని హోమధేను వగు నందినిం గాంచి దాని శీలంబునకు విస్మయం బందుచుండిరి. అష్టమవసుభార్య దానిం దన నెచ్చెలికి కానుకగాఁ బంపఁ గోరి తన ప్రియునకు నివేదించిన నాతండును వల్లెయని నిజభ్రాతృప్రేరితుండై యా కామధేనువుం బట్టి కొంపోయెను. వసిష్ఠుండును దన వేల్పు మొదవుం గానక పరితపించి వనం బెల్ల గలయగోసి తన యోగదృష్టిచే సర్వము నెఱింగి 'మానవగర్భంబున బుట్టుఁ' డని వారిని శపించెను? వారును భయంబున నాతని పాదంబులం బడి పుడమిపై దీర్ఘకాలం బుండకుండఁ ననుగ్రహింపవలయునని వేడుకొనిరి. అమ్మునియుఁ బ్రసన్నుండై 'మీరు గోరినట్లే యగును. కాని యష్టముండు తద్దయు

నపరాధంబు చేసెం గావున మహీతలంబునం బెద్దకాలంబుండు; మఱియు ననపత్యుం డగు ననియె.' అని తెలిపి గంగాదేవి నిజస్వరూపంబుఁ జూపి, యికుమారుండు పెరుగు నంతవఱకు నాయొద్దనే యుండెడు నని శంతను నోడం బఱిచి కొడుకుం దోడ్కొని చనియెను.

---

## ద్వి తీ యా ధ్యా య ము

---

### యౌ వ రా జ్య ము

దేవ వ్రతుడు—అది గాంగేయుని జన్మనామము—తన జనయిత్రికి ప్రేమైకస్థానమై గారాబంబునఁ బెరుగుచుఁ గ్రమముగా రాజపుత్రుల కావశ్యకములగు ధనుర్విద్య, దండనీతి, ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము మున్నగు లౌకిక విద్యల యందే కాక సాంగవేదంబులు శమదమాది యోగంబులు, ఆత్మవిజ్ఞానము మొదలుగాఁగల యాముష్మిక విద్యలయందును, వసిష్ఠ పరశురామాదులగు నాచార్యవర్యుల యండ నపారపాండిత్యం బుపార్జించి సమస్త కళల యందును గురుప్రతిమానుండై శోభిల్లుచుండెను.

ఒకనాఁ డాతఁడు దివ్యభూషణాలంకృతుండై గాంగసైకతంబుల ధనుఃపాటవంబు నిగ్గుదేఱ నభ్యసించుచు సురనదీప్రవాహంబును దన శరపంక్తిని సేతువుగా బంధించి వినోదించుచుండెను. ఇంతలో శంతనుఁ డప్ప్రాంతమునకు మృగయావ్యాజంబున నఱుగుదెంచి యా విచిత్రవృత్తముం గాంచి విస్మయానందంబులం బొరసి యసమధానుష్కుండగు నీ యువకునిం గన నోచిన ధన్య జనకుఁ డెవ్వఁడోకదా యని యాందోళిత చిత్తంబున శంకించు చుండెను. దేవవ్రతుం డాతనిఁ దండ్రిగా

నెఱుంగనేరక నిసర్గ స్నేహ మోహితుండై నిలుచుండెను. ఈదృశ్య ముంగాంచి భాగీరథి తత్తీరంబునఁ జనుదెంచి ప్రియంబుట్టిపడఁ దన కరంబునఁ గొడుకు కుడికేలూని యా భూనాథుం జేరంజని "ఇతండు నీ సుతుండు దేవవ్రతుండు. సకల కలాభరితుండు. వీనిం బరిగ్రహింపు" మని తనయు నాతని కప్పగించి యదృశ్య యయ్యెను. శంత నుండును దన విస్మయకారణుం డాజనన వియుక్తుండగు దన ప్రియ కుమారుండే యని యెఱింగి లబ్ధ సామ్రాజ్యుండగు పేదయుంబోలెఁ బ్రమోదంబు పట్టఁజాలక పుత్రకుని గాఢాలింగన మొనర్చి బాష్ప వారి నాతని మూర్ధంబు దడుపుచుఁ గరంబుల బుడుకుచుఁ బారవశ్యం బున మైమఱచెను. దేవవ్రతుండును నిజజనకు నంకతలం బలంక రించుటకు గొండెక్కి నల్లెంతయు నలరి వినయవినమితాంగుఁడై భక్తి సూపుచుండెను. అనంతరము శంతనుండు పుత్రసమేతుండై హస్తిపురము మహావైభవముతోఁ బ్రవేశించి యొకసుముహూర్తంబున సకలరాజన్య ప్రధానసమక్షంబున గాంగేయునకు యౌవరాజ్యాభి షేకంబుచేసి కొడుకుతోడి వినోదంబులందగిలి యనన్య వ్యాపారుండై యుండెను. అతండొక్కొక్కపరి తనయుని శరప్రావీణ్యంబును, నొక్కొక్కప్పుడు ధర్మపరిజ్ఞానంబును, నొక్కొక్కతఱి పాలనాదక్షతయు, నొక్కొక్కతఱి యాత్మవిజ్ఞానంబును బరీక్షింపుచు నాతని యద్భుత భుజ మేధా సంపదల కెంతయు నాత్మలో నాహ్లాదించుచు దిన మొక క్షణముగా గడపు చుండెను. ఆహా! పుత్రప్రతిభావలోక నమే కదా పితరుల పుట్టుఫలము! దేవవ్రతుండును దన పదవీభాగ్య మునకు తబ్బిబ్బుగాక తన సౌజన్యముచే సామర్థ్యముచే, ధర్మానురాగ ముచే నెల్లరమానసంబుల నలరింపుచు నెల్లరి ప్రశంసలకుఁ బాత్రుఁ డగుచుండెను.

---

# తృతీయాధ్యాయము

## బ్రహ్మచర్య వ్రతము

నాలుగేం డిట్లు హాయిగా నడచెను. పిమ్మట శంతనుం డొక్క నాఁడు యమునాతీరంబున వేఁటలాడబోయి కుగ్రిమ్మరుచు నొక్క యపూర్వ పరిమళగంధం బాఘ్రాణించి విస్మయామోదంబులం బొంది యది వచ్చిన దెస యారయుచుండెను. ఇట్లు కొంత వట్టేగి యమునా తటంబున నోడ నడపుచున్న సురకన్యకం బోని యొక కన్యారత్నము ను గాంచి యామెశరీర సౌరభంబునకును సౌందర్య వికాసంబులకును నచ్చెరువడి రాగ సంక్రాంత చిత్తుండై మెల్లగా నాపెం డాయంజని 'సుందరీ! నీవెవ్వరి దానవు? అలోకలావణ్య మూర్తివగు నీవిట్లేక తమ నోడ నడపుట సంభావ్యం బగునే? యని పశ్నించెను. అందుల కాకన్యక వినమితోత్తమాంగయై 'యేను దాశరాజుకూతురును సత్య వతి యను దానను, తండ్రిని యోగంబున నిక్కార్యంబు ధర్మార్థంబు నేయుచుండుదు' ననెను. శంతనుఁ డాముగుద జిలిబిలి పలుకుల కెంతయు నలరి యామె యభినవరూపసౌందర్యంబు లింతకుమున్నె వినియుండుటచే నా కోమలిం గామించి దాశరాజుకడకుంజని తన మనం బెఱింగించెను. ఆతండును సంతసిల్లి శంతను నత్యంత భక్తి గౌర వంబులం బూజించి యట్లనెను. "వసుమతీశ్వరా? నేడు తమకు మాపై ననుగ్రిహంబగుట కుంటివానిపై భాగీరథి ప్రవహించుట గాదే! కలిగి నకన్యకను దగిన వరునకొసంగుట లోక ధర్మము' అట్టిచో మాపట్టిని దమ్ముం బోలునుత్తమ వరునకిచ్చిన మేము ధన్యులము గామే? అయి నను నాడెందంబునం గల సందియంబుఁ జెప్పెద. ఇక్కన్యను మీరు ధర్మపత్నిగాఁ బరిగ్రహింప నభిలషింతురేని నాదొక్క ప్రార్థనఁ దీర్పుఁడు." అనిన శంతనుండు దాని నీ నగునేని యిచ్చెద; కానిచో

మానెద. అది యేదియో యెఱింగింపు' మనెను. అందులకు దాశరాజు 'భూనాథా! మీకీ కోమలియందుఁ బుట్టిన సుతుఁడు మీపరోక్షం బున రాజు గావలెను. ఇయ్యది మీ కంగీకారం బగునే? యని యడి గెను. శంతనుండు తన ప్రియసూనుండును, యువరాజు నగు దేవవ్రతుం దలంచి 'యీకోర్కె గాక యొండు వేడు మొసంగెద' ననెను. దాశ రాజు 'నా కొండెద్దియు నిష్టంబు లే'దని మోమోడక చెప్పెను. శంత నుఁడు ప్రతిహతమనోరథుండై గృహంబునకుఁ గ్రమ్మఱి చింతాక్రాం తుడై సత్యవతిం దలంచుచు, నన్యకార్యావసరంబుల నవలఁద్రోచి, భోగంబుల పొంతఁబోక నిట్టూర్పులతో నిముసంబులు వెడలించు చుండెను.

దేవవ్రతుఁడు శంతనుని ఖేదంబునకుఁ గారణంబారయఁజాలక, యొక్కనాఁడు తండ్రి పాలికిం జని యిట్లు విన్నవించెను.

"చ. భవ దభిరక్షితక్షితికి బాధయొనర్పఁగ నోపినట్టి శా
త్రవ నివహంబు లేదు, వసుధా ప్రజ కెల్ల ననంతసంతతో
త్సవముల, రాజులెల్ల ననిశంబు విధేయుల నీకు, నిట్లు మా
నవవృషభేంద్ర! యేలొకొ మనఃపరితాపముఁ బొందియుండగన్"

"రాజపుంగవా! నీ భుజ బల సంరక్షితంబగు భూతలంబునకు హానియొనర్పగల శాత్రవు లెవ్వరును లేరు! నీరాజ్య ప్రజలకెల్ల నిత్య కల్యాణంబులు; సామంత భూమీశు లెల్ల నీకు పరమవిధేయులు. ఇట్టియెడ నీవిట్లు మనఃపరితాపంబునఁ గృశింపనేల?" శంతనుం డేమియుఁ బాలుపోక కొంతవడి చింతించి తుద కిట్లు లనియెను. "కుమారా! ఏకపుత్రుడు, అనపత్యుడు నొక్కటియే యని తజ్ఞులు వక్కాణింతురు. మఱియు నీవు శస్త్రాస్త్రవిద్యలయం దప్రతిమానుం డవు. సంగ్రామం బన్న నుత్సుకుండవు. శత్రుసంహారణంబున సాహసి కుండవు. ఇట్టి నీవు చిరంజీవివై నాయంత్యకాలంబున నక్కఱకు వత్తు

వని నే నెట్లు నమ్మఁగలను? కావున బహుపుత్రార్థంబు వివాహంబు నకై యత్నంబు సేయవలయు. ఇదియే నా యాంతరంగిక చింత. ఈపలుకు లాకర్ణించి దేవవ్రతుండు వృద్ధామాత్యపురోహిత సుహృజ్జనంబులతో విచారించి, రాజు సత్యవతీపరాయణుం డగుట యెఱింగి, సత్వరంబుగ ననేక రాజన్యసైన్య సమన్వితుండయి దాశరాజుకడకుం జని యాతనిచేఁ బూజితుండై 'మా రాజునకు సత్యవతిని దేవిగా నొసంగు' మని ప్రార్థించెను. అందుల కాతఁడు పరమ హర్షమునంది వినమ్రుఁడై "యువరాజా! నీవు ధర్మశీలుండవు. అర్థానర్థవిదుండవు. సకల కార్యసమర్థుండవు. గుర్వర్థము కన్యార్థివై వచ్చితివి. కావునఁ నేఁ గృతార్థుఁడ నైతిని. ఈమె జనకుండగు ఉపరిచరుండను రాజర్షి 'యీసత్యవతి నొరుల కియ్యవలదు. శంతనునకే యొసంగునది' యని యాజ్ఞాపించెను. ఇట్టి సంబంధ మెవ్వరికిఁ బడయనగును? ఐన నిందు సాపత్న్యదోషం బొండు జూపట్టెడిని. అయ్యది నీచేతనే సాంపాద్యంబు. నీ వలిగిన హరిహరాదులైన నడ్డమే? కావున నాదోషము పరిహృతం బగునట్లు యోజించి వివాహంబు సేయనగు" నని వాక్రుచ్చెను. అంతట పితృభక్తిపరాయణుండగు దేవవ్రతుండు సంభ్రమావేశంబులు ముప్పిరిగొన సభాసదులకెల్ల రోమహర్షంబుగా నిట్లని యుద్ఘోషించెను. "ఇదియేనా నీ మనోభీష్టము? అట్లయిన"

"చ. వినుఁడు! ప్రసిద్ధులైన పృథివీపతు లిందఱు, నేగురుప్రయో
జనమునఁ జేసితిన్ సమయసంస్థితి, యీలలితాంగి కుద్భవిం
చినతనయుండ రాజ్యమును జేయఁగ నర్హుఁడు, వాఁడమాకునె
ల్లను పతి, వాఁడ కౌరవకుల స్థితి కారుఁ డుదార సంపదన్."

"పృథ్వీపతులారా! ఇయ్యదె గుర్వర్థము నాచేయు ప్రతిజ్ఞ వినుండు. ఈయమ కుద్భవించిన నందనుండే హస్తినాపుర సింహాసనం బధిష్ఠింపం గలవాఁడు. అతఁడే మా కెల్లరకును ప్రభువు. అతఁడే కురు

కుల ప్రతిష్ఠాకారకుఁడు." దాశరాజీ ప్రతినకుఁ దద్దయు సంతసి
వెండియు నిట్లనియె. "నీ వఖిల ధర్మనిదుఁడవు గావున నీ విట్లు చేయ
దొరకొంటివి. కాని నీ భావిసుతులిట్టి ధర్మపరులగుదురే! వారు
నీ మర్యాద నతిక్రమింపకుందురే?" ఈదారుణాలాపంబులకు పితృ
సుఖైక చింతాపరాయణుండు నిరుపమ స్వార్థత్యాగుండు, దేవవ్రతుం
డిసుమంతయు సంకోచింపక తోడనే గంభీర భీషణభాషణంబుల నిట్లుగ్గ
డించెను.

"క. ధృతిఁ బూని బ్రహ్మచర్య
వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత యైనను లోకము లా
యతి బెక్కులు గలవు నాకు ననుభావ్యములై."

"రాజచంద్రులారా! పితృప్రయోజనార్థంబై నేనిదే ముమ్మా
టికిని బ్రహ్మచర్యవ్రతంబుఁ బట్టుచున్నాడను. నాకు సంతతి లేకపోవు
గాక! ఉత్తరలోకంబుల కెట్టి కొదువయు గలుగబోదు."

మేలు! దేవవ్రతా! మేలు! ఈ యసదృశత్యాగముచే నీ
జన్మము ధన్యము! నీ తలిదండ్రులు సుకృతులు! నీవంశము పావనము!
పుత్రులు లే కుందురుగాక! ఉత్తరలోకముల కేలోటును లేదు! 'అపు
త్రస్య గతిర్నాస్తి' యను సాత్త్విక విశ్వాసమున కిది పరశుఘాతము
కదా? ఈ నీ యమూల్య వాగ్రత్నము మాహృదయఫలకంబుల
స్వర్ణాక్షరంబులతో శాశ్వతముగాఁ బ్రకాశించుచుండునుగాక!

ఓహో! ఏమి యీ పితృభక్తి ఏమి యీ యాత్మపరిత్యా
గము! పితృవాక్యపాలనార్థంబై పదునాలుగేండ్లకాల మడవుల
నిడుమలం గుడిచిన శ్రీరామచంద్రుం డొక్కఁడు! పితృవాంఛా
సంతర్పణంబునకై మైహికరాజ్యంబును దృణప్రాయంబుగ వీడుటయె
కాక నవయౌవనంబున సమస్తాత్మోపభోగంబులఁ బరివర్జించిన

భీష్ముం డాయెఁడు! ఇట్టి యనుపమత్యాగము "మాతృదేవోభవ! పితృదేవోభవ!" యని మాతృస్తన్యమునుండియే యభ్యసింపఁబడు ఋషిభూమి యగు భారతవర్షంబునఁ గాక మఱి యెందు దర్శనీయం బగును? స్వదేశంబునకై స్వమతంబునకై ప్రాణములు సమర్పించుట యెఱుంగుదుము కాని కేవల పితృర్థంబుగా నింతటి యాత్మత్యాగం బొనర్చుట యెందేనిఁ గాన నేర్తుమే? ధన్యాసి! భారతమాతా! ధన్యాసి! ఇట్టి పుత్రరత్నంబులం బట్టియే కదా నీవు భవ్యయశోభాగ్యవై ప్రభాసిల్లుట!

ఇట్లు పితృవాంఛా పరితృప్తికై నిజరాజ్య పరిత్యాగంబును బ్రహ్మచర్యవ్రత పరిగ్రహంబునుం జేసిన దేవవ్రతుని దీక్షకును గురుకార్య ధురంధరత్వంబునకును మెచ్చి దేవర్షిగణంబు లాతనిపయిం బుష్పవృష్టిఁ గురిసి *భీష్ముం డని పొగడిరి. దాశరా జెంతయు సంతసిల్లి శంతనునికై సత్యవతిని సమర్పించెను.

అంత నా యినతేజుం డక్కాంతం దోడ్కొని యతిభక్తిమెఁ దనకాంచనరథం బెక్కించి ప్రజలెల్ల బోరనఁ గీర్తింపఁ గరిపురముఁ బ్రవేశించి యాపెం దండ్రికిఁ బరిణయం బొనర్చెను. శంతనుం డతిమానసం బైన యా భీష్ముని సత్యవ్రతంబునకుఁ గరంబు సంతసిల్లి యాతనికి స్వచ్ఛందమరణంబుగా వరం బిచ్చి పరమానురాగంబున సత్యవతిం గూడి యత్యంతమోదంబున దివసంబులు గడపుచుండెను.

---

* నాఁటనుండియే దేవవ్రతుండు భీష్ముం డను బిరుదనామమునఁ బరఁగుచుండెను.

# చతుర్థాధ్యాయము

## భ్రాతృ వివాహము

అనంతరము శంతనునకు సత్యవతియందు చిత్రాంగదుఁడు విచిత్రవీర్యుఁడు నను నిరువురు తనయులు జనియించిరి. కాని వారలు సంప్రాప్తయౌవనులు కాకమున్నే యాతఁడు నాకలోకగతుం డయ్యెను. భీష్ముఁ డాతనికిఁ బరలోకక్రియలు నిర్వర్తించి చిత్రాంగదుని రాజ్యాభిషిక్తుం జేసెను. కాని యాతఁ డతివ్యాలోలుండై గర్వంబునఁ గన్నుఁగానక సురాసురు లనక, మనుజ గంధర్వు లనక యెల్లర నధిక్షేపించుచుఁ గడ కొక గంధర్వవీరుని రోషానలంబునకుఁ బాత్రుఁడై రణంబున నిహతుం డయ్యె.

భీష్ముఁ డాతని దుర్మరణంబున కెంతయుఁ దుఃఖించి యడలుచున్న కుటుంబమున కూఱటఁ దెలిపి, బాలుఁ డగు విచిత్రవీర్యుని కురుదేశంబున కధీశ్వరునిగాఁ బ్రతిష్ఠించి యుభయహస్తంబుల రాజ్యభారము నిర్వహింపుచుండెను. అంతఁ గొన్నాళ్ళకు విచిత్రవీర్యుండు యౌవనారూఢుం డగుటఁ గని వివాహంబు చేయ నిశ్చయించి యర్హకన్యాన్వేషంబునఁ దగిలియుండెను.

అట్టియెడ నొక్కనాఁడు కొందఱు చారు లరుదెంచి "దేవా! కాశిరాజు తన మువ్వురు కూఁతులకును స్వయంవరము జాటినాఁడు. రేపకడ మహోత్సవం" బని తెలిపిన విని సంతసించినతోడనే యావార్త తల్లి సత్యవతి కెఱింగించి యామెచే నియోజితుండై ధనుష్కాండంబులం బూని రథం బధిరోహించి యనన్యసాహాయ్యుండై వారణాశీపురంబునకుం జని యందు స్వయంవరంబునకు మూఁగిన రాజలోకం బెల్ల వెఱచి వెఱఁగుపడి చూచుచుండ నక్కన్యాత్రయంబును రథం బెక్కించుకొని యెల్లవారును విన నిట్లనియె "నే నీకన్యకల నా

యనుజునకుఁ బరిణయం బొనర్ప బలిమిమైఁ బట్టుకొని పోవుచున్నాఁడ. వలంతు లెవ్వరేని నన్ను వారింప నోపుదు రేని సంగరంబున నెదుర్చుఁడు." ఆవల కాశిరాజు నవలోకించి 'రాజేంద్రా! బ్రాహ్మంబు మొదలగు నెనిమిది వివాహములయందు క్షత్రియులకు గాంధర్వ రాక్షసంబు లుత్తమంబులు, స్వయంవరమున జయించి వివాహంబగుట యంతకంటె సత్యుత్తమంబు, కావున నిచ్చట మూగిన రాజలోకంబు నెల్ల నోడించి యిక్కన్యలం దోడ్కొని యే నేగుట యెంతయు ధర్మసమ్మతం' బని చెప్పి వీడ్కొని హస్తిపురమార్గముం బట్టెను. కాని యాతని యహంకారమును సహింపనేరని నానా దేశాధీశ్వరులును తమ తమ చతురంగబలంబులతో నాతని నొక్కపెట్టునఁ బొదివి శరపరంపర నింపఁగా నాతఁడు రౌద్రాకారుఁడై నిఖిల క్షయక్షత్రియార్థం బవతరించిన పరశురాముండునుం బోలె నాక్షత్రి వర్గంబు నెల్లఁ దన శరధారావర్షంబున ముంచి యోడించి జగదేక వీరుండై పరిక్రమించుచుండెను.

ఇంతలోఁ గాశిరాజు నగ్రిదుహితం గామించిన సౌంభపురాధీశ్వరుండగు సాళ్వుండు సమరసన్నద్ధుండై యాతని వెంటనే యరుదెంచి "ఓయీ! స్వయంవరమధ్యమున నే వలచిన కన్యకం గొనియేగుట యిది యేటిపాడి? నీవు జగదేకవీరుండ వని యుప్పొంగుచున్నాఁడ వేమో! ఈ ధరాధినాథుల జయించుటతోడనే సరికాదు. నీవు నిక్కపు వీరుండవగుదు వేని గృహోన్ముఖుండవై పారిపోక నిలిచి నాతోడ బోరు సలుపుము, మదీయ ధనుర్విముక్త మార్గణ గహనంబున నిన్నుం దిగ్భ్రమ నొందించెద" నని నిష్ఠురంబుగ నాడి యాభీష్మ సింహంబును గేసరపటలంబుఁ బట్టిలాగెను. ఇందుకు భీష్ముండెంతయుఁ గనలి రథము మళ్ళించి సంవర్తసమయ సమవర్తియుం బోలె నతి రౌద్రాకారుండై నిలిచి యాతని నెదిర్చెను. ఆ వీరద్వంద్వమ్మును

గొంతవడి ఘోరంబుగాఁ బోర సాళ్వుండు రథంబును రథ్యంబులను సారథినిఁ గోల్పోయి భాగీరథీనందననిచే భగ్నమనోరథుండై లజ్జాభర చిత్తుండై నిజనగరంబునకు నిర్గమించెను.

ఇట్లు సకలరాజలోకంబు సశ్రమంబున నోడించి కాశీరాజు దుహితల అంబా అంబికా అంబాలికల దోడ్కొని పురజనుల జయధ్వానములమధ్య నిజభవనంబు సొచ్చి సత్యవతీదేవికి సమర్పించిన నాపె పరమాహ్లాదంబున బుత్రకుం దీవించి పరిపరిభంగులఁ బొగడి యా కన్యారత్నంబుల విచిత్రవీర్యునకుం బరిణయ మొనర్ప ననుజ్ఞ యొసంగెను. అంత కాశీరాజు కూతుండ్రలోఁ బెద్దదియగు నంబ తిన్నంతకు మున్నే సాల్వపతి వరించుటయుఁ, తన మనం బాతనియందు లగ్నం బగుటయుఁ, దండ్రి యంగీకరించుటయుఁ దెలివి ధర్మమార్గముం బాటించి తన్ను విడిచిపుచ్చుమని బహుప్రకారంబులఁ బ్రార్థించెను. భీష్ముఁ డామె విన్నపమును ధర్మవిధులైన బ్రాహ్మణుల కెఱింగించి వారి యనుమతంబున నాపెను గొందఱు వృద్ధాంగనలు తోడుగ సాళ్వ రాజుకడకుం బంపెను. ఆవల నొక శుభలగ్నంబున నంబికా అంబాలికలను దన యనుజుండగు విచిత్రవీర్యునకు విధివిహితంబుగా మహా వైభవంబున వివాహం బొనరించెను.

---

## పంచమాధ్యాయము

### గురుధిక్కారము

ధర్మబద్ధుండగు దేవవ్రతునిచేఁ బ్రేషితయైన యంబ తిన్నగా సాళ్వభూపతికడకుం బోయి తన యమలిన కన్యకాత్వం బెఱింగించిన

నాతండు పరిభవానల దగ్ధుండుగావున "మగువా! ఎన్నఁడు భీష్ముండు నిన్నుం గొనియె గనో ఆనాడే నీకన్యాత్వం బెడలినది, అన్యాపహృత యగు నిన్నుం బత్నిగా వరియింపనగునే!" యని యనాదరణ సేసి మిన్నకుండెను. అంబాలకా కామిని యెంతయుఁ జింతిలి 'మనోరమణా' భీష్ముఁడు తమ్మునికై కన్యలం గైకొనబోయి నా వృత్తాం తెఱుంగక బలిమిమై నన్నుంబట్టె కాని నేను నీయధీన నగుట యెఱింగినంతనె నా చెలియండ్రను మాత్రమె యింటం బెట్టుకొని నన్ను నీ సన్నిధికిం బుత్తెంచె. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారము నాకుం జేయించిన కతంబున నింత పుట్టె. ఇందు నా దోషంబు లేశం బేని కలదే? నిన్నుంగాని యన్యుల దలంపనైన నొల్లని నన్నిట్లు సంతతశోకానలంబునం ద్రోసిపుచ్చుట పాడియగునే? దయచేసి నన్నుం బరిగ్రహింపుము. అని యనేకవిధంబుల గరుణాతిరేకంబుగా వేఁడు చుండిన యత్తలోదరిం గాంచి సాళ్వుండు నిర్దయుండై 'పో పొమ్ము. ఇచ్చట నింక దడయకు'మని యా దీనురాలిని మందిరమునుండి వెడల నడచెను.

అంత నక్కాంత యింతిం తనకాని పరిభవసంతాపంబులం బొంది నేను సాళ్వునకుం దప్పినప్పుడే సంసారమునకుం దప్పితిని. మరల భీష్మునిపాలికిం బోనేల? ఈ బెడదకంతకు నాతఁడే హేతువు. కావున నెట్టులేని నాతనినే సాధింతుంగాక? యనికృత నిశ్చయురాలై తపశ్చర్యంగాంగేయుం గెలువనెంచి యొక మునివనంబున కఱిగి తపంబున కుద్యోగించుచుండెను. ఇంతలో నొక రాజర్షి యా యాశ్రమంబున కఱుదెంచి యా మానవతిని గాంచి యాపె విషాదవృత్తాంతము సాకల్యంబుగాఁ దెలిసికొని యామె తన దుహితృతనయ యగుట నెంతయుఁ జింతించి దుష్కర సమాధినుండి యా కోమలి మానసంబును మళ్లించి క్షత్రియమత్తేభంబులకుపంచానన ప్రాయుండగు పరశురా

ముందు తనకుఁ బరమాప్తుం డగుట నెఱింగించి యాపె నాతని శర ణంబు వేడుమని యుపాయముం జెప్పెను. అంబయు నట్లే యాబ్రాహ్మణ వీరు సందంజేరి యాతనికిఁ దన దీనవృత్తాంతం బెఱింగించెను. పరశు రాముండును దన మిత్రుని మనుమరాలిట్లు కారణంబుగా క్షత్రియ మదాంధ్యంబున నెడలేని కడగండ్ల కగ్గమగునే యని చింతించి తీవ్ర కోపావిష్టుండై సానుకంపంబుగా నిట్లనియె. "బాలా! నాలిం బొంద కుము. నే నిదె యాదుష్కృతుల నక్కడగించి నీయభీష్టంబు నడపెద. ఐన నిందుపరిభవముం దీర్ప రెండు తెఱంగులు తోఁచుచున్నవి. సాళ్వుం గడ తేర్తునా? ఉద్ధురుండగు భీష్ముం బరిమార్తునా? నీహృదయగతం బెఱిఁగింపుము." అనవుఁడు హతజీవితయగు నంబ కొంత తెప్పిరిలి 'స్వామీ! సాళ్వుండు నన్నెట్లును జేకొనఁడు. నా యీదురవస్థా కారణుం డగుభీష్ముం బొలియింపంబూనియే యేనిట్లు తపశ్చర్యకై వచ్చితిని. దేవర దేవవ్రతుత్రుళ్ళడగించి నామనఃకలంకముం దీర్చుదురు గాక!' అనిన పరశురాముండు 'కుమారీ! గాంగేయుండు నాచెప్పిన చొప్పున కొడంబడఁగలఁడు. లేకున్న వానిని మట్టుపెట్టుట సాధ్యంబు. ఇఁక నీయుమ్మలికం బుడుగు' మని యాపె నోదార్చి మునిజనంబు వెంటరా, నంబాసహితుండై కురుక్షేత్రంబునకు వెడలి సరస్వతీతీరంబున విడిది నేసి భీష్మునికిఁ దనరాక నెఱింగించెను. ఆతండును ఋత్విక్ పురోహిత ప్రభృతులతోఁ బూజాద్రవ్యంబులుగొని తత్ప్రదేశంబునకఱిగిన నమ్మ హాత్ముం డాతని భక్తివినయసంభ్రమంబులకు సంప్రీతుండై యభినం దించి యాతఁ డొనర్చిన యర్చనలంగైకొని కుశలప్రశ్నంబులు నేసి యనంతరము కాశిరాజుకన్యకం జూపి యిట్లనియె. "ఓయీ! నీవు మొదల బలిమిమై దెచ్చిన యిప్పుడతిని మరల ద్రోసిపుచ్చుట యుచి తంబుకాదు. ఈపె క్రమ్మఱ నీదాపునకువచ్చెం గావున పాడిమై నీతమ్మునకుఁ బాణిగ్రహంబు నేయుము." అనిన భీష్ముం డిట్లనియె.

'స్వామీ! సంగతి నవిస్తరంబుగఁ దెలిసి నాయందు దప్పుగలదేని నన్ను దండింపుము. ఈమెసాళ్వుండు తన మనోనాథుండు గావునఁ దన్నాతని పాలికిం బంపఁగోరఁగాఁ నే నట్లొనరించితిని. పరకామినిం బట్టి నాయనుజున కెట్లు గట్టిపెట్టుదును? ఇయ్యది యధర్మాచరణంబు గాదే!" ఈవచనంబులకు నా వీరశ్రేష్ఠు కినిసి మండిపడి 'మగటిమి గలిగి నందులకు ఫలము కన్నెమిన్నలఁ గష్టపెట్టుటయా! ఓరీ! వీరకుల కలంకా! నీ శ్రీరంగనీతు లింక జాలించి నేఁచెప్పినట్లు చేయుము. లేదేని నిన్ను సమిత్రబాంధవముగా యమసదనంబున కనిపెద'నని వెఱపు గొలిపెను. కాని భీష్ముఁడు తాను పూనినది న్యాయైకపథమనియు, తనయం దెట్టిలోపంబును లేదనియు, తన్ననుగ్రహింపుమనియు వివిధ వాక్యంబుల వినతుండై వేడుకొనియు, గార్యంబుఁగానక చింతిలి యెట్ట కేలకు తెగించి 'నీవు నాకు కోదండ పాండిత్యంబుఁ గఱపిన దేశికుం డవు. నేనీకుఁ బ్రియశిష్యుండను. ఇట్టినాయెడ నకారణంబుగ నీవ్వైర మెత్తి యాగ్రహావిష్టుండవగుట యర్హంబగునే? యని యాడెను. ఈధిక్కారమునకు పరశురాముం డుదగ్రకోపుఁడై "ఓరీ వీరమ్మన్యా!

చ. గురుఁడనినన్నెఱుంగుఁ, దనఘుండవు, నావచనంబు నందనా
దరణముసేసి, తెన్నియొవిధంబులఁ బల్కెదుభక్తితోడఁనీ
వెరవులుదక్కు, మీయబల వేగను పెండిలిసేయు, మంతతో
మరలు మదీయకోపశిఖ, మానదు వేఱొకవేయుఁజేసినన్.

నన్ను గురుఁడని యెఱింగియు నామాటల నాదరింపకున్నావు. మఱియు భక్తుఁడువోలె నటించుచు నెన్నియోవిధములఁ బ్రత్యుత్తరము లిచ్చుచున్నావు. నీ కపటోపాయంబులఁ నీపాటికిఁ గట్టిపెట్టి నీతమ్మునకీయబలను బెండ్లిసేయుము. లేదేని నీవు వేయిచేసినను నా కోపాగ్ని చల్లారనేరదు." అని నిష్కర్షఁగా జెప్పెను. అంత భీష్ముండు కృతనిశ్చయుండై తీక్ష్ణత దోఁప నిట్లనియె. అయ్యా? నేచేసిన యప

రాధం బెయ్యది? ధర్మాచరణుం డగు నాజోలికి నిర్నిమిత్తంబుగా రానేల? ఒకనియం దనురక్తయగు తరుణినిం బరున కిల్లాలుగాఁ జేయుట తగ వగునే? తొల్లి పెద్దలు,

"గీ. గర్వియై కార్య మిట్టి దకార్య మిట్టి
దని యెఱుంగక, లోకంబు చను పథమునఁ
దిరుగ, కున్మనవృత్తి వర్తించునట్టి
వాని గురునైన దండింప వలయు నండ్రు."

గర్వంబునఁ గార్యాకార్యము లెఱుంగక, లోకమార్గముపొంతం బోక యున్మార్గుండై వర్తించువాఁడు గురుఁడైన నవశ్యము దండనార్హుం డని వక్కాణించిరి. కావున నిట్టి యకృత్యం బాచరించుట కంటె నీచేతం జచ్చుటయె లెస్స యని వచించెను. ఈ యాలాపంబులకు గురుండు కాలానలంబునుం బోలె మండిపడి "అట్లయినఁ గయ్యంబున కాయిత్తం బయి సైన్యసన్నాహంబు సేసి సమరంబునఁ జనుదెమ్మ" ని యాజ్ఞాపించెను. అంతట భీష్ముండు పదాఘాతంబు వడిన కాలభుజంగంబుపగిది బుస్సు మని లేచి నయనంబు లరుణంబులుగఁ కటంబులు కంపింప 'విప్రుఁడవు, ఆచార్యుండవు గావున నింతవ ట్టోపిక పట్టితిని. నే నెదిర్చిన నీవ కాదు, ఉగ్రుండు నిలువ నేర్చునే! తొల్లి క్షత్రియుల గీటడంచితినని తలంచుచుంటి వేమో! నాఁడు భీష్ముండు గలుగకుండెఁ గావున నీమాటలు సాగివచ్చినవి. ఏదీ? నీవు లావుగల వాఁడ వగుదువేని నన్నుం బరిమార్చి నీ ప్రతాపంబు సూపుము. మఱియు,

"క. నే నొక్కరుండ వచ్చెదఁ
గాని, బలము దేను, నీవు గఱపిన శస్త్రా
స్త్రానేక విధ విలాసము
గాన వలయు నేన గాదె? తథ్యం బరయన్."

నీవు నేర్పిన శస్త్రాస్త్ర విద్యావిభవంబుండ నా కన్య సైన్య సంపత్తియేల? మద్బాహుబల సాహాయ్యమాత్రుండనై యొక్కరుండనే పోరికిం జనుదెంచెద" నని పలికి యతనికిం బ్రణమిల్లి గృహంబునకు మఱలి సత్యవతి కంతయు నెఱింగించి యద్దేవి యనుమతిం బడసి సర్వ సన్నద్ధంబగు రథం బెక్కి విప్రాశీర్వాదంబులు సెలంగ వెడలి కురుక్షేత్రంబునం జేరి యాచార్యుని కనతిదూరంబున నరదంబు డిగ్గి వినతుండై నిలిచి స్వామీ! నీవు భూచారివై యున్నవాఁడవు. రథికుండనైన నాకు నీతోడ సమరంబు సేయునగునే?' యని పలికెను. అంత పరశురాముండు తన ప్రభావంబుచే దివ్యరథ రథ్యంబులును శస్త్రాస్త్రంబులును గలిగి కొండొక శిష్యుని సారథిగా నంగీకరించి యుద్ధ సన్నద్ధుండై తోఁచినం జూచి శాంతనవుండు రథారోహణం బొనర్చి శంఖంబు పూరించి గుణంబు సారించి యాచార్యునకుఁ బ్రణమిల్లి కదనంబునకుం గడంగెను.

అనంతర మా యోధాగ్రేసరు లగు గురుశిష్యులు శౌర్యాటోపంబులు మెఱయఁ దలపడి విజృంభించుచు కరి కరియు, హరి హరియు, గిరి గిరియుం బోలె నొక్కరొకని పరాక్రమముతో, రెట్టించు నాగ్రహముతో, తీవ్రించు నుత్సాహముతో నఱచుచు, నేయుచుఁ, ద్రుంచుచు, నొంచుచుఁ గలంచుచు మహాద్భుతంబున నొక్కవడువున సంగ్రామంబు సలుపుచుండిరి. ఒకపరి భీష్ముండు బడలును; ఒక మఱి భార్గవుండు డయ్యును; ఒకనాడు గురుండు నొగయును; ఒకవేళ శిష్యుండు సొగయును. ఇట్లిరువురు నతిదారుణంబుగా నిరువది రెండు దినంబు లుదయంబుతో మొదలిడుచు నస్తమయముతో నాగుచు రణంబు నిర్వర్తింపు చుండిరి. విజయలక్ష్మి యెవ్వరిని వరియించుటకును నిర్ణయింపఁజాల కుండెను. మఱునాఁడా యిరువురును చలముతో నొకరిని మించి యొకరు శరంబులఁ గురియసాగిరి. శక్తులఁ బ్రయో

గింపఁ దొడఁగిరి. విండ్లు ముక్కలయ్యెను. నారసంబులు వ్రక్కల య్యెను. వారులు నొచ్చెను. భీష్మసారథి చచ్చెను. గురుఁ డలిగెను. భీష్ముండు పొగిలెను. ఏనఁ జేయునదియేమి? భీష్ముఁడు గ్రీష్మ రోచి ష్కుని వలె దుర్నిరీక్ష్యుండై పగ్గంబులు ధరించి యుగ్యంబులఁ దోలుచు యోధసారథులు దానయై మహాభయంకరముగాఁ బోరుచుండెను. సురాసురు లాశ్చర్యముతోఁ జూచుచుండిరి. ఆ నాఁడు గురుఁడో శిష్యుఁడో మడియుట నిశ్చయం బని యెల్లరుఁ దలంచు చుండిరి. కాని యింతిలో భానుండు పశ్చిమాంబుధి న స్తమించెను. యోధులును నిల యంబున కరిగిరి.

నాటిరాత్రి భీష్మునకు సులభముగా నిదుర పట్టలేదు. పోరు మొదలిడి పెక్కునాళ్లు గడచెను, భార్గవుం డింకను బడలలేదు. విజయ మింకను సమీపింపలేదు, 'సురభూసురులారా! నాకీ ధర్మయుద్ధంబున జయంబు ప్రసాదింపరే?' యని భక్తిమై బ్రణామంబులు సేసి ప్రార్థించి విజయైక ధ్యానపరుండై నిమీలితుండై నిద్రానిమగ్నుం డయ్యెను. అనంతరము ప్రభాతసమయంబున నష్ట వసువులును నాతని స్వప్నం బున సాక్షాత్కరించి, దిగులుమాన్పి పరశురాముం బరిమార్పఁగల మోహనాస్త్రం బొసఁగి యదృశ్యులైరి. భీష్ముండును మేల్కాంచి సం తోషించి తన్మంత్రస్వరూపంబును, ప్రయోగోప సంహార ప్రకారంబు లును జిత్తంబున నిలిపికొనుచు కాలోచిత కృత్యంబు లాచరించి యొక సారథి నేరికొని యరదంబు పూన్పించి సన్నద్ధుండై మహోత్సాహం బున సమరంబున కఱిగెను.

పరశురాముండును గర్వముతో "ఓరీ! నిన్న సగము చచ్చితివి. ఉన్న సగమును నేఁడు దీర్చెద" నని వీరాలాపంబు లాడుచు భీష్ముని గర్వభంజనమునకై పరాక్రమించి కవిసెను. నేఁడు నిన్నటి భీష్ముఁడు కాకుండెను. ఆతని తీవ్రబాణజాలంబునకు భార్గవుండు తాళఁజాలక

మొగంబున రోషాగ్నిశిఖ లెగయ భీష్మునిపై బ్రహ్మాస్త్రముం బరపెను. భీష్ముండును రుద్రుండు నాఁ దేజరిల్లుచు నొండొక బ్రహ్మాస్త్రం బేసెను. అంత గగనం బంతయుఁ దేజస్స్థగితం బయ్యెను. సకల భూతంబులును సంక్షోభించెను. అట్టియెడ నిదె యదనని భీష్ముండు మోహనాస్త్రంబు నావాహనంబు సేసి విడువ నుద్యోగించు చుండ నారదుం డరుదెంచి యా ఘోరకర్మంబు విరమింపఁజేసి 'కుమారా! నీ వఖిలధర్మ విదుండ వయ్యు నిట్లు నిష్ఠురుండవై గురున కవమానంబు ఘటింప యత్నించు చున్నాఁడవు. కురుప్రవరుండ వగు నీ కిది యర్హంబే?' యని బోధించిన దేవవ్రతుండు మోహనాస్త్రం బేయుట మానెను. పరశురాముం డీ వృత్తాంతం బెల్ల నెఱింగి యోటమి తనపై నెక్కించుకొని చలంబునఁ బోరఁ దొడఁగెను. ఇంతలో జమదగ్నియు, జాహ్నవీదేవియు నయ్యెడ కవతరించి విప్రునకు రోషమత్సరంబులు గూడునే యనియు, గురువుతో గ్రుద్దులాడ నగునే యనియుఁ దమ తమ పుత్రులకుం దెలిపి వారి మనంబుల రణకేళినుండి మళ్ళించి గురు శిష్యులకు మైత్రిఁ గూర్చిరి. అంత నారద జమదగ్ని ప్రముఖులును భాగీరథియు భార్గవ రాముం జేరి "దేవవ్రతుఁడు నీ శిష్యుఁడు. వానియెడ నలుగ దగునే? వాఁడు తగవుమాలిన పని చేయఁజాలక పెనంగె. ఇంతియకాని విరోధికాఁడు. వానిం గరుణించి యెప్పటివాత్సల్యంబు వహింపు" మని తెలిపి భీష్ముం బిలిచిన నాతఁడమ్మహాత్మునకు సాష్టాంగదండ ప్రణామంబు సేసెను. పరశురాముండాతని దీవించి లేవనెత్తి కౌగిలించుకొని "గాంగేయా! నీ శక్తికి భక్తికి బ్రీతుండనైతి. నీ ధర్మభావంబునకు మెచ్చువచ్చె" నని సస్నేహంబుగా సంభావించి యంబ నవలోకించి "కుమారీ! భీష్ముండు నన్నుం గెలిచె. నా వలన నగుపని యింతియ. నీ విఁక నీకుఁ బోలిన తెఱంగుఁ జూచుకొమ్మని పలికెను. ఆ మానినియు 'స్వామీ! నీ యోపినంత గావించితివి. ఇంక నే నేమి

చేయుదువు? నేను తపో మహిమంబున నీ జన్మంబునఁ గాకున్న మాని జన్మాంతరంబున నైన భీష్మునిం దెగటార్తు'నని ప్రతిన గొని యెందో యఱిగెను. * అనంతరము పరశురాముఁడు భీష్ముని వీడ్కొలిపి మునిజనంబులతోఁ నిజాశ్రమంబునకుఁ జనియెను. జాహ్నవియు దన తనయుని దీవించి యంతర్ధాన మయ్యెను. ఆ వల సర్వసురుల యాశీర్వాదంబులు, సంభావనవచనంబులు మిన్ను ముట్ట భీష్ముఁడు సదనంబునకు మఱలిపోయెను.

ఆహా! భీష్ముని ధర్మానురక్తి! ధర్మదీక్ష!! కావున నేయాతఁడు భీష్ముఁ డయ్యెను. తాను తగవుగా నమ్మిన దానికొఱకై గురువుతో నైన గ్రుద్దులాడు నంతటి ధర్మదీక్ష మరల నవీనభారతులకలవడు సుదిన మెన్నఁడు వచ్చునో కదా!

---

## ష ష్ఠా ధ్యా య ము

### ప్ర తి జ్ఞా ని ర్వ హ ణ ము

విచిత్రవీర్యుఁడు వివాహమాదిగా నంబి కాంబాలికలయం దతి ప్రణయుండై నిరంతరభోగ లాలసుండై సకల వ్యాపారములను గట్టి పెట్టి సంతతమును సఖురాండ్రతోఁ క్రీడించుచుండెను. స్వేచ్ఛావర్తనమునకన్నఁ బరమశత్రువున్నదే? ఇట్లు స్వచ్ఛందవిహారుండగు విచిత్రవీర్యుండు క్రమముగా నిర్వీర్యుండై శరీరము శుష్కించి యచిరకా

* అవల నామె తీవ్రతపం బొనరించి భీష్ముం బొరిగొనునట్లు వరంబువడసి ద్రుపదునకు శిఖండి యను పేర కూఁతురై యవతరించి యావల నొక యక్షునివలన పుంస్త్వముం బొందెను.

లంబుననే యసువులు విడిచెను. భీష్ముఁ డాతనికి బరలోకక్రియలు నిర్వర్తించి, ప్రౌఢయి యత్యంత శోకార్ణవంబున మునిఁగియున్న మాతను, మఱదం(డను నాశ్వాసించి యరాజకంబైన రాజ్యంబు నక లంకంబుగాఁ బ్రతిపాలించుచుండెను.

ఒకనాఁడు సత్యవతి శాంతనవుం జేరంబిలిచి యిట్లనియెను.

"క. శంతెను సంతానంబును
సంతతకీర్తియును బిండసంస్కృతియును న
త్యంత మహీభారమును బ
రంతప! నీయందు చిరతరంబై నిలిచెన్.

చ. జననుత? సర్వ ధర్మవులు సర్వ జగత్పరివర్తన క్రమం
బును మఱి సర్వవంశములుబుట్టిన మార్గము నీవ నిక్కువం
బనఘ! యెఱుంగు దున్నతగుణాఢ్యుడవున్ భరతాన్వయావలం
బనుఁడవు నీవ; నిన్నొకఁడుపంచెద, జేయుము మత్ప్రియంబుగాన్.

క. ఇక్ష్వాకువంశంబున నీ
వొక్కరుఁడవ యున్నవాఁడ, వుర్వీరాజ్యం
బెక్కటి సేకొని తేజము
దిక్కుల వెలిగింపు సంతతియుఁ బడయు మొగిన్.

క. నిరతంబు బ్రహ్మ మొదలుగ
వరుసన యెడతెగక యిట్లు వచ్చిన వంశం
బురుభుజ! నీవుండఁగ నీ
తరమున విచ్ఛిన్నమగుట ధర్మవె?" [యనినన్.]

'కుమారా! శంతను మహావృత్తంబునకు నీ వొక్కఁడొవ్వ్వే మిగిలియున్నావు. ఆ పుణ్యచారిత్రునకు వంశము నిలుపను కీర్తిఁ బెను పను, తర్పణంబు విడువను, మహీభారంబు మోయను నీ వొక్కఁడవె యాధారమవు. నీవు స్వధర్మములను, సర్వ జగత్పరిణామంబును, సర్వ

వంశోత్పత్తియు నెఱుంగుదువు. ఉదారగుణసంపన్నుఁడవు. అక్కటా! బ్రహ్మమొదలుగ వచ్చు భరతవంశ శృంఖలము నేటికి నిర్వక్ర భుజపరాక్రముండవగు నీ వుండగనే, నీ తరంబుననే విచ్ఛిన్నం బగుట యెవ్వరికైన నోర్వవచ్చునే! నీవు కురురాజ్యలక్ష్మితోఁ బాటుగ నర్థాంగలక్ష్మింగూడఁ జేకొని యీ పురాతనవంశవృక్షమును విస్తరింపఁజేయుము. నాయందలి ప్రియంబునం జేసి నా ప్రార్థన కన్యథా వర్తింపకుము." అని దైన్యంబుగా నాడిన భీష్ముండు విని 'అమ్మా! మీ కీర్తి యీనతి యీయఁదగునె? నా యాడినమాటను నాతాల్చిన వ్రతమును జెఱుచుటకు నే నంత చిఱుతవాఁడనా?

క. హిమకరుఁడు శైత్యమును, న
ర్యముఁడు మహాతేజమును, హుతాశనుఁ డుష్ణ
త్వము విడిచిరేని గుర్వ
ర్థము నా చేకొనిన సువ్రతంబు విడుతునే?

చంద్రుఁడు చల్లదనమును, సూర్యుఁడు తేజమును, అగ్ని వేడిమిని విడుచునగాక! దేవవ్రతుండు మాత్రము గుర్వర్థంబుగాఁ గైకొన్న ప్రతిన మానఁజాలఁడు. పృథివ్యాది మహాభూతంబులు గంధాది గుణంబులు నెట్లు పరిత్యజింపవో యట్లే భీష్ముండును గురుకార్యంబున మీ శుల్కార్థంబుగా సర్వజన సమక్షంబునఁ జేసిన సమయంబును విడువఁజాలఁడు.

ఆహా! దేవవ్రతుని వచస్స్థైర్యము! సౌఖ్యములు సమసినను, ప్రాణము పణమైనను, తుదకు వంశవినాశన మైనను ఆడినమాట తప్పఁజూడని ధీరత్వమే కదా మహాపురుషుల ప్రధానలక్షణము! ఎట్టి కొండలవంటి యిక్కట్టులును వారి మనఃప్రవాహమును నిశ్చితమార్గము నుండి మళ్లింపఁజాలవు. వారి మన స్సెప్పుడును దన సహజప్రతిభయే సాహాయ్యముగా కార్యోపాయముల నన్వేషించును గాని కార్యావసర

ములకు లొంగదు. ఈ స్వభావమే వారి మానసికరచనలో ప్రధాన భాగము. ఇదియే వారి యౌన్నత్యమునకు ముఖ్యకీలకము.

దేవవ్రతుని వాక్యములు విని దేవి యీముప్పు గడచు చొప్పెయ్యదియో యని యనేకవిధములఁ జింతించుచుండెను. అంత భీష్ముఁ డాపె కిట్లనెను. "తల్లీ! నీ వాన తిచ్చినట్లు నే నెఱుఁగని ధర్మువులు మృగ్యంబులు. శంతను సంతానంబు శాశ్వతం బగునట్లుగా నే నొక్క క్షత్రియధర్మంబుఁ జెప్పెద. అద్దాని లోకయాత్రానిపుణు లయిన బ్రాహ్మణవరులతో విచారించి యాచరింపవలెను. తొల్లి భార్గవరాముండు పితృవధకోపపరివీడితుండై క్షత్రియకులమును గూలంకషంబుగా నాశనము చేసినప్పుడు భూసురోత్తములు వారి సతులకు ధర్మవిధిని సంతతి నిలిపి రనుట సుప్రసిద్ధము. మఱియు బలి యను భూమీశ్వరుం డనపత్యుండై మామతేయ మహర్షి వలనఁ దనపత్ని యం దపత్యంబు వడసె నని విందుము. ఇంతియకాక యుత్తమ క్షత్రియ క్షేత్రంబులందు ధర్మమార్గంబున బ్రాహ్మణులవలనం బుట్టి వంశకరు లయినక్షత్రియు లనేకులు గలరు. కావున విచిత్రవీర్యుని క్షేత్రంబులందు సంతతిం గావించుటకు నియతాత్ముఁడు, జగత్పావనుఁడు, ధర్మస్వరూపుఁడు నగు బ్రాహ్మణు నొక్కనిం బడయుదము."

ఈ వాక్యములు విన్నంతనే "ఇదియేమి? బుద్ధికుశలుండును, సర్వధర్మపారంగతుండును, సర్వజనసంభావితుండును నగు భీష్ముం డిట్టి యధర్మాచరణంబును బోధించెను!" అని చదువరులు కొంద ఱాశ్చర్య చకితులు కావచ్చును. కాని యానాఁటి సంఘనీతి యట్టిది. మన స్మృతికర్త లాపద్ధర్మములలో నిట్టియాచారము నవలంబనీయముగా వివరించియున్నారు. దీనినే నియోగ మందురు. ప్రస్తుతము మన కిది నింద్యముగను హేయముగను కర్ణకఠోరముగను నున్నను మన ప్రాచీనలు దీని నాదరము తోడను గౌరవముతోడను వాడుచునే యుండిరి.

కావుననే భీష్ముఁడు దానిని నిశ్శంకముగా నుపదేశించెను. ఇట్టి యుదాహరణంబులు పురాణములలో పెక్కులు గలవు. ఈ యాచారము నీతిబాహ్యము కావున మన సంఘమునుండి యదృశ్య మగుట మనకు సంతోషదాయకమే. కాని యది యెట్టియుద్దేశ్యముతో ఎట్టి జాగ్రత్తతో, ఎట్టి చిత్తపరిశుద్ధితో నాచరింపఁబడుచుండినదియుఁ బరిశీలించితి మేని మన జుగుప్స యించుక సడలవచ్చును. భీష్ముఁ డీయాచారమును నిర్దుష్ట మని నమ్మి శరణీయముగాఁ జెప్పెనే కాని యొక దోషముగాఁ దలంచియుండలేదు. కావున దాని కలంకమును మన మాతనితలపై నెక్కింపఁజాలము. ఇంతేకాక తరుణోపాయమును సూచించి వంశోపద్రవముం దప్పించిన యాతని ధర్మపరిజ్ఞానమును, ప్రతిభయు నెంతయు సంస్తవనీయములు.

ఈ కార్యోపాయమునకు సత్యవతి యెంతయు నలరి నిజ తపోదహన దగ్ధ పాపేంధనుండును, నిఖిలధర్మమూర్తియు, నిత్యసత్యవచనుండును నగు కృష్ణద్వైపాయనుండు నానియోగంబునను, నీయనుమతంబునను నీభ్రాతృక్షేత్రంబులయందు సంతానంబు వడయుఁగాక యని వాక్రుచ్చెను. భీష్ముం డమ్మహర్షి నామసంకీర్తనము చెవిం జొరినంతనే పరమభక్తితో నాతఁడున్న దిక్కునకు మ్రొక్కి పరమపావనుండును, విరించి ప్రతిమానుండు నగు వ్యాసభట్టారకుం డిక్కురువంశంబుఁ బ్రతిష్ఠించుట యెల్లవారికి నభిమతం బని నుడివెను. అంతట సత్యవతి కురువంశోద్వహనార్థంబు వేదవ్యాసుం దలంచిన నమ్మహాముని భావుండును తత్క్షణంబ దేవిముందటఁ బ్రత్యక్షమై ప్రథమపుత్రుం డగుట నామెచే నతిహర్షంబున నాలింగితుండై యామె కభివాదనంబు నేసి భీష్ముం డొనర్చిన యర్ఘ్యాదిపూజల నంగీకరించి సుఖాసీనుం డయ్యెను. అంత సత్యవతి యమ్మహాముని కుశలం బడిగి "కుమారా! నీవు పుత్రుండవు గావున నీ కొక్క పనుపుఁ జెప్పెద.

"చ. అనుపమరాజ్యసంపదకు నర్హుఁడు, వంశము వి స్తరింప నో
పిన సుచరిత్రుఁ డీసుతుఁడు భీష్ముఁడు తొల్లియుఁ దండ్రికిం బ్రియం
బనఘుఁడు సేయుచుండి నిఖిలావని రాజ్య నివర్తనంబునుం
దనరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదిత ప్రతిజ్ఞుఁడై."

భరతవంశ మహావనంబున నేఁటి కీ భీష్మవృక్షం బొక్కఁడే మిగిలియున్నది. కౌరవాన్వయాలంకారుఁ డగు నీ భీష్మకుమారుండు కురురాజ్య రమా విభవంబున కెంతయు నర్హుఁడు. భరతవంశము వి స్తరింపఁ జేయఁదగు భవ్యచరిత్రుఁడు. అయిన నీధీరుఁడు తొల్లి తండ్రికై రాజ్యపరిత్యాగంబును, బ్రహ్మచర్యవ్రతంబును దాల్చినకతంబున మా యాస లెల్ల నడియాస లగుచున్నవి. త్రిజగంబులు, త్రికాలంబులు నెఱింగిన నీ కీ యన్వయవిచ్ఛేద మెఱుఁగనిది కాదు. అయ్యో! ఎద్దాని నామాక్షరంబుల నార్యభూమి సుప్రసిద్ధమై వెలయుచున్నదో యట్టిభరతకులదీప మింతటితో నారిపోవలసినదేనా? అట్టి కురుకులాంబుధి యింతటితో నింకిపోవలసినదేనా? హా? నేఁటి కీ చిరంతనవంశమున కెంతటివిపత్తు సంభవించినది? ఇట్టికష్ట మెవ్వరి కేని నోర్వవచ్చునే? కుమారా! నీ కొక్కవిన్నపంబు చేసెద. దాని నంగీకరించి మమ్మీ యాపత్కూపమునుండి యుద్ధరింపుము. నీ యనుజుం డగు విచిత్రవీర్యుని సుక్షేత్రంబులయందు నీవు సంతతిం బడసి కురుకులము నవిచ్ఛిన్నము సేయుము. నీకారణమున వంశ మనాకుల మగును. తదాప్తులును బ్రజలును శోకభయంబు లుడుగుదురు. నాకును భీష్మునకును మనఃప్రియం బగును." అని యనేక భంగులఁ బ్రార్థించెను. అంత సాత్యవతేయుండు 'తల్లీ! అట్టిధర్మం బెల్లెడఁ గలదు. అయ్యది శ్రుతిస్మృతివిశ్రుతంబు. నీయానతిచొప్పున నీకోడండ్రయందు ధర్మవిధింబుత్రోత్పత్తి కావించెదను. వీరలు నే నుపదేశించు వ్రతం బొక వత్సరం బాచరించి శుద్ధాత్మ లగుదు రేని సత్పుత్రులు పుట్టగలరు."

అని యానతిచ్చెను. సత్యవతి యందుల కెంతయు సంతోషించి 'కుమారా! రాజ్యం బరాజకం బైన ప్రజకుఁ బెక్కుహానులు వాటిల్లుఁ గావున సత్వరము ప్రసాదింపు' మని చెప్పిన నమ్మహాత్ముండు వల్లెయని యొకశుభముహూర్తంబు నిర్ణయించి యాశ్రమంబున కరిగెను.

భీష్ముండును దన వ్రతభంగము లేకయే ముప్పు గడిచి తమ మనోరథము సిద్ధించినందులకుఁ బరమాహ్లాదమున నుండెను.

---

## సప్తమాధ్యాయము

### రాజ్యరక్షణము

అనంతరము వ్యాసమహర్షి నియోగంబున నంబికకు ధృతరాష్ట్రుండును, అంబాలికకు పాండుండును ప్రభవ మొందిరి. కురుకులము మరలఁ జిగిర్చెను. సత్యవతీ గాంగేయుల మానసంబులు చంద్రోదయముం గాంచిన సముద్రమువలె నుప్పొంగెను. ప్రజ లపరిమితానంద భరితులైరి. భీష్ముఁ డాబాలకులకుఁ దండ్రిలేని యెట్టిలోపంబును దల సూపకుండఁ గడు గారాబంబునఁ బెనుచుచుఁ గ్రమక్రమముగా నుపనీతులం జేసి యోగ్యులగు నాచార్యులయందు వేదశాస్త్రంబులను రాజవిద్యలను నభ్యసింపఁ జేసెను.

ఆతని నిపుణశాసనంబున కౌరవరాజ్యము సకల సంపదలకు నాలవాలమై యఖిల సుఖంబుల కాటపట్టై శోభిల్లెను. ప్రజలు ధర్మాభిరక్షితులై యభ్యుదయముం గాంచిరి. వలసినప్పు డెల్ల వానలు కురియుచు సస్యసమృద్ధి సేయుచుండెను. మొనవులు పుష్కలముగా

పాడి పిదుకుచుండెను. తరువనంబులు ఫలపుష్పభరితంబులై యుండెను. జను లన్యోన్యహిత కాంక్షులై మెలంగుచుండిరి. భూసురాగారంబుల నధ్యయనంబులును స్వస్తివాచకంబులును రమ్యముగా వినవచ్చు చుండెను. ఆతని రాజ్య మెల్లవిధముల రామరాజ్యముం దలపించుచుం డెను. భీష్ముం డిట్లు ధర్మోత్తరంబుగాఁ బాలించుచు ధృతరాష్ట్రుని రాజ్యాభిషిక్తుం గావించి తనవిల్లును, విదురుని బుద్ధియు సహాయము లుగా రాజ్యము సంరక్షించుచుండెను.

పిమ్మట ధృతరాష్ట్రునకు పెండ్లియీడు రాగా సర్వలక్షణస మన్వితయై అనేక సంతానవరములం బడసిన గాంధారిని దేవేరిఁగాఁ జేసెను. పాండుకుమారుండును స్వయంవరమున కుంతిని, భీష్మును మతంబున మాద్రిని బరిణయమయ్యెను. ఇట్లిరువురు కులాంకూర ములును బెరిగి పెద్దలై ప్రమానుగట్టిన వృక్షములంబోలె విరాజిల్లు చుండిరి. ధృతరాష్ట్రునకు దుర్యోధన, దుశ్శాసనాదులగు నూర్వురు తనయులును, పాండునకు ధర్మ, భీ, మార్జున, నకుల సహదేవులును నుదయమై దిన దిన ప్రవర్ధమాను లగుచుండిరి. ఇట్లుండ గొన్నినాళ్ళ కు పాండుండు కాలగతిఁ బొందెను. భీష్ముఁడును, ధృతరాష్ట్రుఁడు నాత నిమరణంబున కెంతయు దురపిల్లి యాతని పుత్రుల కెట్టిలోటును గలు గకుండ నధికప్రేమంబునఁ బెరుచుచుండిరి. తదనంతరము భీష్ముఁడు ద్రోణాచార్యుని బిలిపించి మనుమలకు ధనుర్వేదముం గఱపించి వారిని యోధవిద్యా ప్రావీణ్యులం గావించెను. పాండవులు కౌరవులకన్న నధిక సమర్థులును సద్గుణులు నగుటచే వారు ప్రజల యధికానురాగ మునకుఁ బాత్రులగుచుండిరి. కౌరవుల కిది దుస్సహాముగా నుండెను. వారెన్నియో కుతంత్రములం బన్ని పాండవుల దుదముట్టింప యత్నిం చుచుండిరి. భీష్మాదులు పలుమరు వారి దురుద్యోగంబులు వారింపుచు హితవు గఱపుచుండిరి. కాని యాబోధలెల్ల బధిరునిపట్ల వీణాగానం

బుల వలె వ్యర్థమయ్యెను. తుదకు దుర్యోధనుఁడు శకుని సాహాయ్యమున మాయాద్యూతముం బన్నెను. ధర్మజుఁడు రాజ్యమోడెను; తమ్ములనోడెను, తనన్నోడెను. తుదకు పత్నినిఁగూడ గోల్పోయెను! అంత పాపాత్ములగు కౌరవులు పాండవులకు దాస్యమిచ్చి ద్రౌపదిం జుట్టుపట్టి సభకీడ్చి తెచ్చిరి క్రూరులై యాపె వస్త్రములనూడ్చిరి. ఆసతి "యిది పాడియే, యేను దాసినే" యని పెద్దల కాక్రందన మొనర్చెను. ధృతరాష్ట్రుఁ డూరకుండెను. భీష్ముఁడు మిన్నకుండెను. ద్రోణుఁడు మాటాడకుండెను. సభయంతయు సంక్షోభమొందెను. బాలుఁడు వికర్ణుఁడు మాత్రము బహిరంగముగా నిది యధర్మమని చాటి చెప్పెను. విదురుఁడు తెగవెజఁగి యూరకుండుట పాపహేతు వనెను. కాని భీష్ముడు పల్లెత్తి యొక్క మాటయైన నాడలేదు. ఇదియాతని శీలమున నొక చిన్న మచ్చయందురు. కాన యాతడేల మౌనమువహించె నందము? అధర్మవేది యది యకృత్యమని యెఱుంగక పోలేదు. ధర్మానురక్తుఁడును గాకపోలేదు. ఐన నాతడు రాజాదరంబుననును, రాజునకు వెఱచియు నూరకుండె నందమా?

అట్లన్నటకినిఁ గాజాలదు. దుర్నయము లాచరించినప్పుడు రా రాజైనమాత్రమేమి? మఱియు త్రిజగద్వీరుఁడగు నాతనికి దుర్యోధనుఁడన్న నొక్క వెఱపా? ఇక నొక్కటియే కారణము గావలెను. ఏమన, ఆతడిదివర కెన్నియో పర్యాయములు నయమున భయమున సుయోధనునకు బుద్ధులు సెప్పెను. కాని యవి యాతని తల కెక్కలేదు. ఆతఁడు తన కుత్సితమార్గమున బోవుటకు శంక వహింపలేదు. అట్టియెడ నిప్పట్టునమాత్రము తన నీతులు పాటింపబడునే యని యెంచి వాగ్వ్యయముచేయ నిచ్చగించకయుండును. మఱియు జితేంద్రియుండును బెద్దయు నగుట వారిదుష్కర్మ ఫలము వారే కుడుతురని యానిమేషమున సహించియుండవచ్చును. మఱియు

వట్టి నృశంసుల దురంతము మఱింత దాపించుచున్నదికదా యని తాట స్థ్యము వహించి యుండవచ్చును. ఏమైననేమి? భీష్మునకు మాత్రమింత దనుక వారెత్తియిట్టిదని పలుకలేదు. ఆసాధ్వీమణి "అయ్యో! కలి యప్పుడే వచ్చెనే? లోకమునధర్మము శూన్యమయ్యెనే?" యని గోలుగోలున విలపించెను. భీష్ముడు నిశ్చలచిత్తంబున నిట్లనెను. "మా నినీ! దీనిఫలము వేగమే యీకురుకుల పాంశను లనుభవింతురు"

భీష్ముని హృదయాంతరాళమునుండి వెలువడిన యీ వాక్య మొక్కటియే యాయన మౌనమును, మనస్సునువిప్పి చెప్పుచున్నది. ఇఁక నన్య చర్చాపేక్షయేల?

కౌరవుల దుశ్చేష్టలంతటితో నాగలేదు, వారాసతీమణినిఁబదిం బదిగఁ బరాభవించిరి. పాండవులు ప్రచండ ప్రతిజ్ఞలబట్టిరి. సభయంత యుసంక్షుభితమయ్యెను. ధృతరాష్ట్రుఁడిదియేమని సుతులను మంద లించి, ద్రౌపదిని క్షమింపవేడి పాండవులను విడిచిపుచ్చెను.

పుట్టకుపుట్టిన బుద్ధి పుడకలతోఁగాని పోనేర్చునే? దుర్యోధ నుఁడు మరల మాయజూదముం బన్నెను. ధర్మజుండునిర్జితుఁడయ్యెను. పందెమునకుఁగా పాండవులు పంద్రెండేండ్లు వనవాసము, నొక్క యేఁడజ్ఞాత వాసమును నెరపిరి. ఆవల నైదూళ్ళిచ్చినఁజాలునని కౌరవులతో సంధికై యత్నించిరి. శ్రీకృష్ణుని రాయబారమంపిరి. కృష్ణుఁడు శతవిధముల జెప్పెను. భీష్ముఁడు బోధించెను. ధృతరా ష్ట్రుఁడు ప్రార్థించెను. కాని దుర్యోధనుండు విననొల్లఁడయ్యెను. పాండవులకు సమరము తప్పకుండెను. కురువంశ కాననమున దావాగ్ని రగు ల్కొనెను. కురువైరమను నగ్నిశైలము ప్రళయభయంకరముగాఁ బ్రద్దలయ్యెను.

యుద్ధనిశ్చయమైనతోడనే దుర్యోధనుఁడు తన పదునొకం డక్షౌహిణులకు నాయకుల నిరూపించి, వారిందొడ్డొని భీష్మాచార్యుల

సన్నిధి కరిగి చేతులు దోయిలించి "తాతా! మన పదునొకం డక్షౌహిణులకు నాయకులుగా నీ వీరుల నియమించితిని.

క. తారలకుం జంద్రుని గతిఁ
గౌరవులకు మేఁటివీవ కావున నీవీ
భారంబుపూని మముఁ గడ
చేరుపఁదగు నెమ్మెయిం బ్రసిద్ధ చరిత్రా!"

ఓ జగదీశ్వరా! చుక్కలకుఁ చంద్రునివలె, కౌరవులకు నీవు మేఁటివి. నీవీ సంగ్రామ భారముం బూని మమ్ముల నొడ్డుఁ జేర్పవలయును. ఇన్ని సేనలకును నాధిపత్యము వహింపఁగల దక్షుని నిన్ను దక్క మనలో నన్యునిం గానము కావున నా ప్రార్థనమన్యథా గావింపక సర్వసైన్యాధిపత్యముం బూని, శత్రు బలంబులం జమరి, జయలక్ష్మిం జేపట్టి మమ్ము సంరక్షింపుమని యనేక విధములఁ బ్రార్థించెను.

భీష్మున కుభయపక్షములును సమానములు. కాని పాండవులు ధర్మబుద్ధు లగుటచే వారియం దాదరము మెండు. కౌరవు లధర్మవర్తను లగుటచే వారియెడ తృణీకారమధికము. అట్టియెడల నాతఁడాత్మసౌఖ్యమునే యభిలషించి యుండినచో సంగ్రామంబునం బాల్గొనకయో పాండవపక్షముం జేరియో తన యవసాన కాలము హాయిగాఁ గడపియుండును. కాని యా మహాపురుషు నే యైహిక సుఖములును, ఏ ప్రాపంచక ప్రలోభములును స్వధర్మమునుండి మళ్ళింపలేవు.

ఐనచో నాతని స్వధర్మ మెయ్యది? ఆతడు కురు రాజ్యరక్షణము నకై కంకణము గట్టకొనెను. జీవితము ధారవోసెను. అందులకే యాతఁడు దుశ్చేష్టుఁడగు దుర్యోధను కొలువున నైననుండ నియ్యకొనెను. ఇంతకాలము నాతని యండ నుండి, నేడు మాత్ర మాతని వీడుట యెట్లు? అయ్యది స్వధర్మాతిక్రమణము గాదే? ఆ మహాధర్మా

భీష్ముఁడు, ఆ మేరుసమానధీరుఁడు మేనఁ బ్రాణములున్నంత కాలము చేత ఖడ్గము ధరించినన్నాళ్ళు, ప్రేమపాశములఁ ద్రెంచి యాదరానాదరములఁ ద్రుంచి ధర్మమో యధర్మమో—స్వధర్మమును దీర్పవలసినదే; ప్రభు నియోగమును శిరసావహింప వలసినదే. కావుననే యాతఁడు కురుపక్షముం బూని ప్రియ పౌత్రులనే శాత్రవులుగ నెంచి దారుణ రణమున నర్వాభాగముం గొనఁ గృతనిశ్చయుం డయ్యెను.

ఆహా! ఏమి యీ స్వధర్మ పరిజ్ఞానము! ఏమి యీ స్వధర్మావలంబనము! ఈ మహాత్ముని జీవన జ్యోతియంతయు స్వధర్మకాంతులనే వెదఁజల్లుచున్నది. ఈ మహాయోగి జీవిత పాత్రమంతయు 'స్వధర్మే నిధనం శ్రేయః' యను నార్య వాక్యసారముతోడనే ప్రపూరితమై యున్నది. ఇట్టి స్వధర్మ జ్ఞానమువంక భారతీయులు మఱల నెప్పుడు కన్నులు విప్పుదురో కదా!

కురురాజుకోరికకు భీష్ముఁ డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

"ఆ. మీరుఁ బాండుసుతులు నారయ నాకొక్క
రూప; కార్యమున్న యూపువలుక
వలయు; గయ్యమైన వత్తు; మీలోన నా
యునికి చందమునకు నుచిత మిదియ."

"కుమారా! నాకు మీరును బాండుపుత్రులు నొక్కటియే. ఐన నేను మీలోనే యుంటిని గాన యుద్ధమైనచో మీ పక్షముననే వచ్చెదను. నీ కోరినయట్లు సర్వసైన్యాధిపత్యముం దాల్చెద. రణమున నన్నెవ్వరు నెదుర్పఁజాలరు గాని యర్జునుని మాత్రము నేమారొ్కనఁ జాలను. అతఁడు శరంబుల నాకునుమిన్న. మఱియు బెఱవారిని చెఱకు లట్లు నఱుక నేర్తునుగాని ప్రియమైన పాండునందనుల మాత్రము రూపఱఁ జేయుటకుఁ జేయూడదు. అయిన నప్పటికి దగిన భంగిఁ జూచుకొందము. మఱియు నొక్కవిశేషంబుఁ జెప్పెద. తొల్లి

నాచేఁ దిరస్కృత యగు నంబ దైవవరంబున శిఖండియై పుట్టె గావున నే నాతని కెదురేయకుండుట నా వ్రతము. మీ రాతని నే మఱకుం డునది." ఈ యంగీకారమునకు దుర్యోధనుం డెంతయుఁ బ్రమోది తుండై భేరీ మృదంగాదులు మ్రోయించి, నగరాలంకారము చేయించి గురు, కృపాదులు ప్రహర్షింప, పురోహితసహితుండై విధిచోదితం బుగా మహోత్సవంబున నాకురువృద్ధు నభిషేకించి సర్వసైన్యాధిపత్య మునకుం బట్టముం గట్టెను.

---

## అ ష్ట మా ధ్యా య ము

---

### ప రా క్ర మ ము

మఱునాఁటి ప్రభాతంబున ధర్మక్షేత్రమగు కురుక్షేత్రరంగంబున కౌరవ పాండవబలంబులు రెండును సంగ్రామమునకు సన్నద్ధములై యభిముఖములై కూడుకొనియుండెను. కురుసైన్యము పదునొకండ క్షౌహిణులును గురు కృప శల్యసైంధవాది మహావీరుల యాధిపత్యం బున బారులు దీరి నిలిచెను. యోధాగ్రేసరుండగు భీష్ముండు కవ చము ధరించి, చాపముం బూని, కాంచనతాళధ్వజంబు గల రథం బధిరోహించి శ్వేతచ్ఛత్రముక్రింద నపర సూర్యునివలె వెలుంగుచుం డెను. కాల్బలముల కంఠస్వనములును, గజబృందముల బృంహితంబు లును, హయచయంబుల హేషలును కర్ణేంద్రియంబులఁ జెవుడు వరచు చుండెను. మణిమయంబులగు రథ కేతనంబులును, స్వచ్ఛంబులగు నిస్త్రింశంబులును, భర్మ నిర్మితంబులగు వర్మంబులును బాలసూర్యుని యరుణ కాంతులు దగిలి చిత్ర విచిత్ర ప్రభాపుంజముల నీనుచుండెను.

అట్టియెడ భీష్ముండు భూవల్లభుల నెల్లఁ గూడం బిలిచి వార లతో నిట్లనియెను.

"క. ఆరయ వివృత స్వర్గ
ద్వారము రాజులకు నాహవం, బందు మహో
దారులు దొల్లియు నరిగిరి
మీ రీ మార్గమున నడవ మెయికొను టొప్పున్.

క. ఇంటం దెవులునఁ జచ్చుట
కంటెను బాపంబు లొండు గలవె నృపులకున్
బంట కలను పోలి గలఁ నిది
గంట నిధానంబు గంటగాదే! మనకున్."

"రాజులకు రణము తెరచిన స్వర్గద్వారము. ఇంటఁ దెవులునఁ జచ్చుటకంటె నృపులకు నరకము లేదు. వారికి పోలిగలనే పంటక ళ్ళము. తొల్లి ధీరోదారులగు మన పూర్వులీ ధర్మముం దలంచియే సంగ్రామంబునకుం జొచ్చిరి. మీరును వారి దారినే యనుసరించి వారి కీర్తిని విస్తరింపఁజేయుఁడు." ఈ యుద్బోధనంబునకు వారెల్లరు నుద్రిక్తులై "చంపుదుము. లేకున్నఁ జత్తుము. ఇంతియకాని యొండు గా వర్తింప" మని పలు విధంబుల శపథంబులొనర్చి నిజసైన్యంబుల కరిగిరి.

తరువాత కురురాజు కోరికపై భీష్ముఁడు చారు నిబిడంబును, దుర్భేద్యంబు నగు మనుష్యవ్యూహముం బన్ని, కురుపతి నంగరక్షణ ముతో నడుమ నిలిపి తానును ద్రోణుండును కన్నాకులై యుండి సమరంబునకు వేచియుండిరి. అట్టియెడ ధర్మజుఁడు పాదచారియై కురు వ్యూహముం దరిసి పితామహుపాలికిం జని పాదాభివందన మొనర్చి సవినయముగా సంగరమున కనుజ్ఞ వేడెను. దానికి భీష్ముఁ డెంతయు నలరి 'వత్సా! వైరుల నిర్జింపుము. నీకై రణ మొనరించుట దక్క

యొందువరంబు వేఁడు' మనెను. ధర్మరాజు "తాతా! రారాజువక్షంబున నే పోరు సలుపుము. కాని నా హితమును మతి నెంచు" మని కోరెను. అంత భీష్ముఁడు నీ తలంపేమి యని యడుగ ధర్మనందనుఁడు 'మహాత్మా! నిన్ను బొలియించు నుపాయముం బోధించి మమ్ముఁ గాచు'మని ప్రార్థించెను. అందులకు భీష్ముఁడు,

"చ. చుట్టఱికంబునన్ మనసు సొచ్చి ననుం గరఁగించి వేడినన్
దిట్టతనంబు వో విడిచి తీవ్రరణంబు కడంక దక్కి నేఁ
బట్టిన యాయుధంబు వెడఁబోసినఁ గాని వధింపఁబోల ది
ట్టిటన కేగు మిప్పరుసయింతకుఁగాలము కాదు దానికిన్."

'కుమారా! నీవు చుట్టరికంబున నామనసు కరఁగించి నన్ను వేడితివేని నేఁ జెప్పునది వినుము. నిర్జరుల కేని నన్ను నిర్జించుట కలవి గాదన్న మీకు నలవి యగునే? దిట్టతనము విడిచి రణోత్సాహంబు డిగి శస్త్రసన్న్యాసం బొనరించినఁ గాని యేను మీకు వధ్యుండను. ఇఁక ప్రశ్నించుట కిది యదనుగాదు. అరుగు' మనియెను. పాపము! ధర్మజున కాశాభంగమయ్యెను. తోడనే యాతఁడు తాతను వీడ్కొని యావల గురు, కృప, శల్యులచే ననుజ్ఞాతుండై నిజసైన్యంబున కరిగెను. అంత కొంతవడికి దుర్యోధనుండు వ్యగ్రోత్సాహుండై యత్యాగ్రహంబున సైన్యంబులం బురికొల్ప శంఖ, భేరీ, మృదంగాది నిస్వనమ్ములు చెలంగెను. గాంగేయుం డత్యుత్సాహంబున ముంగట గదలి కౌరవ వాహినుల నడుపుచుండెను. పాండవవానీకంబులు మహా సంరంభమున గర్జానాదంబొనర్చుచు శౌర్యోద్రేకంబున శత్రువుల నెదుర్కొనెను. అంత బదాతిపదాతిని, ఆశ్వికుఁడాశ్వికుని, హాస్తికుఁడు హాస్తికుని, రథికుఁడురథికుని, దలఁపడి యొండొరులను గుంతంబులఁ బొడుచుచు, ఖడ్గంబుల నఱకుచు, శరంబులనాటుచు, గదాప్రహారంబుల గుదియ నేయుచు దీవ్రంబుగ రణం

బొనర్చుచుండిరి. పాండవు లతిభీకరంబుగా వీరవిహారంబునేయుచు శత్రుసేనలఁ జక్కాడుచుండిరి. అంత భీష్ముఁడు దుర్యోధన ప్రేరితుండై గ్రీష్మభానునిపగిది తీండ్రించి తన ప్రతాపాగ్నికి పాండవబలంబుల శలభంబులుగఁ జేయదొడఁగెను. పాండవవ్యూహము విచ్చుమొగ్గకలగి యిటు నటుఁ బరుగిడఁ దొడఁగెను. పాండుపుత్రులు నివ్వెరపడి చూచుచు వాపోవుచుండిరి. అంతలో సాయంతన మగుడు నాఁటికి రణము ముగిసెను.

ఆ పరాజయమునకు ధర్మరాజు మిక్కిలి విచారము నొంది నిశాసమయంబునఁ దమ్ములతో శ్రీకృష్ణునికడ కరిగి,

"చ. ఎరగలి చిచ్చు గాఅడవి యెల్లను బెల్లుగ నొక్కపాయగా
దరికొని రూపడంచిన విధంబున నిక్కడి సేన యంతయున్
దరమిడి చంపె, భీష్ము బల దర్ప మహోగ్రతగంటె? యింక నే
బిరుదొకొ నీలమేఘమనఁ బేర్చి యనిం దెగటార్చు నాతనిన్?

చ. అలవి యెఱుంగ నేరక మహాత్ముని లోకముతోడి పాటిగాఁ
దలఁచితి, బేలనై తి, శరతాడన పీడితు లైరి నీ మఱం
దులు, నమరాపగాతనయుతోడి రణంబునకున్ దిశాధినా
థులు నఱుమంగఁజాలరని తోఁచుచున్నది నామనంబునన్.

చ. అతని జయించునంచు మన మర్జును నెంతయు నమ్మియుండఁగా
నితఁడును సంగరంబున నుపేక్షకుఁ డయ్యె, వృకోదరుండొకం
డ తఱికిఁజొచ్చి దోర్బలము డాపకపోరెడు, నేమినేయు? నా
కితనిని నీతనిం దడవ నేటికి? గయ్యపుజోలి మానెదన్.

క. నరపతుల నెల్ల భీష్ముస
కెరగా నొప్పింపఁజాల నే నడవులకున్
మరలం బోయెద నచటం
దిరిగెద గూరాకు గోసి తినియెద ననఘా!"

"కృష్ణా! కార్చిచ్చు రగుల్కొని కాఱడవుల రూపుమాపు నట్లు భీష్ముఁడు మనసేన నంతను దగ్ధము కావించుచున్నాఁడు. మందబుద్ధినై యా మహాత్ముని సామాన్యునిఁగా దలంచి సమరంబున కుపక్రమించి చెడితిని. ఇఁక భీష్ముదవాగ్నికి నీలమేఘుంబన నతిశయించి యాతనిఁ బొలియింపం గల శూరునొక్కనినైన మనసేనలోఁ గానము. నీ మఱఁదు లందఱు నాతనిధాటికిఁ దాళజాలక పోయిరి. దిక్పతులు గూడ నాయనను రణంబున నెదుర్పఁజాల రని తోఁచెడిని. అర్జునుఁ డాయనం జంపునని యాశపెట్టుకొంటిమి. కాని యాతఁ డుపేక్షించుటచే నది పొల్లైనది. భీముఁడు మాత్రమే సమయముం గనుపెట్టి తన దోర్బలంబును వెనుదీయక చూపుచున్నాఁడు. ఇంతకును వీరల జోలియేల? ఈ నరనాథులనెల్ల భీష్మున కెరఁజేయఁ జాలను. మరల నడవుల కరిగి కూరాకులు గోసికొని తిని మనియెదను నీ యాజ్ఞయే" మని యడిగెను. అంత కృష్ణుఁడు ధర్మరాజునకుఁ దన బలమును దెలియజెప్పి తన యనుజుల నిరుపమ వీర్యముం దేటపఱచి, తన సేనాపతుల బాహాదర్పముం బోధించి జయం బెట్లును దమకు సిద్ధంబేయని నూల్కొల్పి పంపెను. మఱునాఁడు పాండవులు నిర్వక్ర పరాక్రమంబున సంగరం బొనర్చిరి. అట్టియెడ భీష్ముఁడు తన బలంబుల దెస పరికించి యింక పోరుసలుపుట యనర్థమని నిశ్చయించి శిబిరంబులకు మరల్చెను.

మూఁడవనాఁడు భీష్ముం డభేద్యం బగు గరుడవ్యూహముఁ బన్ని కయ్యమున కుపక్రమించెను. ఆ నాఁడు భీమసేనుఁ డుదగ్ర భీమాకారుండై యేడఁజూచినఁ దానయై సముద్రంబున మహామత్స్యంబునుం బోలె స్వేచ్ఛావిహారము సలుపుచుండెను. ఆతని బాణప్రయోగంబున సుయోధనుండును మూర్ఛిల్లెను. కురుబలంబులు బెదరి చెదర నారంభించెను. అట్టియెడ రారాజు మూర్ఛదెలిసి భీష్మద్రోణుల కడకరిగి,

"ఉ. ఉక్కున మూఁడులోకములు నొక్కటఁ దాఁకెనయేనిఁ బోరమీ
రొక్కఁడొకండ గెల్చుటకు నోపదు రక్షమవృత్తి; నిట్లుమీ
ముక్కన నూర్పుగల్గ మనమోహర మీదురవస్థ బొందునే?
యక్కట! మున్న పాండవుల కల్గక నొల్లమి సెప్పరైతిరే?"

"శూరాగ్రేసరులారా! ముల్లోకము లొక్కుమ్మడి నెత్తి వచ్చి తాకినను మీరొక్క రొక్కరే సంగరంబున నవలీలగ గెలువఁ గలరు. కట్టా! మీ మేనఁ బ్రాణము లుండగనే మన మొన యిట్లు దురవస్థపాలగునే? మేము పాండవులపై నద్రోకింపఁ జాలమని మున్నె యెఱిఁగింపక పోలిరా? తాతా! నీచే నే నెంతయు భంగపడితిని. నీవీ సంగతి నాఁడే చెప్పిన కర్ణుండును నేనును మా పాట్లు మేము పడెడి వారము." అని పరుసముగాఁ బలికెను. అందుకు భీష్ముఁడు చిరు నవ్వు నవ్వి 'రణధీరులు, భుజవీర్యులు, శరప్రావీణ్యులు నగు పాండుపుత్రుల నింద్రసహితులగు దేవతలైన నోడింపజాలరు. అట్టిచో వృద్ధులు, గతాయువులు నగు మా చేతను, దుర్బుద్ధులగు మీచేతను వా రోడింపఁబడుదురే? అయినను మా చేతనగుకొలది మా ప్రతాపము చూపెదము. చూతువుగాక!' యని సమాధానపరచి పంపెను. అంత ద్రోణుఁ డొకప్రక్క విజృంభించి తన యేడ్తెఱఁ జూపుచుండఁగా భీష్ముం డొకవైపున నేపు మిగిలి తెక్కలు వచ్చిన కొండయుం బోలె పాండవసేనల చిదుకగొట్టఁదొడగెను. అ మదకరీంద్రము నడుమ దెవ్వరు? పాండవసేనలు గుండెచెడి కలగుండువడి పాఱ నారంభించెను. నాటితో కురుక్షేత్ర మహాయుద్ధము ముగియవలసినదే. కాని శ్రీకృష్ణుఁ డర్జునుం బ్రేరేచి భీష్మునిపైకి రథము నడిపెను. అంత నా యిరువురు జోదులు నత్యుగ్రముగాఁ బోరుసలిపిరి. భీష్ముఁడు వాడి నారాచంబులనర్జునుని, కృష్ణుని, హయంబులను గూడ గాఢముగా నొవ్వనేసెను. ఐనను పార్థుఁడు భీష్మునిపై శరవర్షముఁ గురియుచునే యుండెను. భీష్ముఁడును

వానిం దునుముచు తీవ్రబాణంబులఁ బనుపుచుండెను. అపరాహ్ణం బగునప్పటికి నర్జునుఁ డలసెను. కాని భీష్ముఁడు నడిమింట ప్రొద్దువలెనే దుర్నిరీక్ష్య తేజోవిలసితుండై యుండెను. అంత కృష్ణుఁడు తన మానసంబున,

"ఉ. పాండవ సైన్యముల్ గలఁగి పాఱెడు సిగ్గఱి, వీరిలోన నొ
క్కండును భీష్మమార్గణని మగంటిమి సూపఁగ లేఁడ, యింద్రపు
త్రుండును జాల నొవ్వడరి తూలెను ; నిట్టిదయైన నేఁడ తీ
ర్పండెయితండుకౌరవనృ పాలు సమస్తమనోరథంబులున్."

'పాండవ బలములు కలఁగి సిగ్గు విడిచి పాఱిపోవుచున్నవి. భీష్ము నెదిరింపఁగల శూరుఁడు వీరిలో నొక్కఁడును లేడయ్యెను. అయ్యో! అర్జునుఁడును జాల నొచ్చి చలించుచున్నాఁడు. ఏమియూశ. ఈ భీష్ముఁ డొక్కఁడే నేడు కురురాజు కోరికల నెల్లను దీర్చునట్లున్నది! మన జోదులు పాఱుట చూచి కురుసేనలు విజృంభించి చుట్టుముట్టుచున్నవి. ఇట్టి పట్టున నే నూఱకుండఁ జెల్లునే? ఎట్లైనను దేవవ్రతుం జంపి, ధర్మసుతుం గెలిపింతుం గాక!' యని వితర్కించుచుండెను. అత్తఱిభీష్ముడు పటుతర విశిఖంబుల నర్జునుపయిం బరప నాతఁడు ధైర్యము చెడి, వీర్యముఁ దొఱఁగి డీలుపడి యుండెను. ఇది గనిన కురుబలంబు లాతనిపై మొత్తంబులుగఁ గవియఁదొడఁగెను. సాత్యకి యర్జునునకు సాహాయ్యుఁడైఁ వెన్నుచూపెడు పాండవసేనలఁ బురికొల్పుచుఁ బోరసాగెను. కాని కౌరవ ప్రవాహము దుర్వార్యమై యుండెను. అంత కృష్ణుండు రోషావిష్టుండై,

"శా. గంగానందను గూల్చి, ద్రోణు పని సక్కఁజేసి, కౌరవ్య వీ
రాంగమ్ముల్ నఱుమాడి, తత్ప్రబల సైన్యంబెల్ల మాయించి యి
త్తుం గౌంతేయుల కిమ్మహీవలయమున్ దుర్దాంత చంచద్భుజా
సంగ స్ఫూర్జిత చక్ర విక్రమకళాసంక్రీడనోన్మాదినై."

"దురాత్మగుండగు దుర్యోధనుండు విజయుండై గర్వాతిరేకంబున నుర్వీ రాజ్యం బేలుచుండ నేఁజూచి సహింతునే? ఏమైనఁగానీ, మద్భుజాదర్పంబు మెఱయ, నా చక్ర విక్రమం బేర్పడ భీష్మునిం గూల్చి, కురుసైన్యంబులఁ గాల్చి కౌంతేయుల నీ మహీచక్రంబున కధిపతులం గావింతుఁగాక!" యని నిశ్చయించి ప్రతిజ్ఞాభంగమైనను సుదర్శనముం బూని, రథంబు డిగ్గి యెదుటికి యుగ్రాకారుండై కురుసైన్యంబులు భయంబునఁ బరుగులెత్త, పాండవవీరుల యుత్సాహంబు రేకెత్త మాహాత్మ్యోద్రేకంబున భీష్మునిపైకిఁ బోవుచుండెను. భీష్ముఁ డీసంరంభముం గాంచి, నిజప్రతిజ్ఞ నుల్లంఘించినదైన ధర్మవిజయముం గూర్ప నెంచు శ్రీకృష్ణుని ధర్మపరాయణత్వము నాత్మలో ప్రశంసించి "మహాత్మా! నన్నిప్పు డీవిధంబునఁ గృతార్థునిఁ జేయ జనుదెంచితివే? వేగదయచేసి నీ చిత్తము వచ్చిన ట్లొనరింపు" మని సప్రియంబుగా ననెను. అర్జునుఁడు రయంబునఁ దేరుదిగి శ్రీకృష్ణునిఁ దన హస్తంబులం బొదివి యాతని యుద్యమం బుడుపుచు,

"ఉ. కోపము సంహరింపు! యదుకుంజర! పాండవకోటి కెల్లనుం
దేపవుగావె! నీ విటు లధీరతఁ బూనికిఁ దప్పినం బ్రతి
జ్ఞాపరుఁడైన ధర్మసుతు శౌర్యము ధైర్యము బాహువీర్యమున్
రూపఱిపోక కాదె! యనురూపమె నీకిది లోకనాయకా?

చ. ఇటుఁ దగునయ్య? కృష్ణ! శమియింపుము, సాత్యకిఁ బంపినాడ విం
కట చని తేని, నీదగు సహాయత గౌరవసేన రూపు మా
పుట యవలీల నాకు నను బొల్లుగఁ జేయుట నీకు బాడియే?
కటకట! నాపరాక్రమము గాసిగఁ జక్రముచేత నంటితే?"

"యదువీరా! కోపము సంహరింపుము. నీవు తేకువచెడి వ్రతము దప్పిన ప్రతిజ్ఞాపరుం డగు ధర్మజుని శౌర్య ధైర్య వీర్యంబులు సమసిపోకుండునే? సర్వధర్మ విదుండవగు నీకిది సముచితమగునే? నీవు

మీఁదికిఁ బోదువేని సాత్యకినిఁ జంపుకొన్నట్లే! నీ సహాయసంపదచేఁ గురుబలంబుల నవలీలగా రూపు మాపెదను. నలుగురిలో నన్నుఁ జులకన చేయకుము. నా పరాక్రమము వ్యర్థమగునట్లు చక్రము నంటకుము.'' అని మఱి మఱి వేఁడుకొనెను.

కృష్ణుఁ డీధీరవచనంబులకు సంతసిల్లి మరల రథంబెక్కి సారథ్యంబున కుపక్రమించెను. అర్జునుం డయ్యవసరంబునఁ జూపిన పరాక్రమంబునకు భీష్మద్రోణాదులుసైతము తాళఁజాలకుండిరి. అతని ప్రతాపాగ్నికిఁ గురుబలంబు లెండిన జమ్ములవనములవలె భస్మీభూతములగు చుండెను. ఇంతలో సాయంతన మయ్యెను. భీష్ముఁడు నాఁటికి సంగ్రామంబుచాలించి తన బలంబుల శిబిరంబులకు మరల్చెను.

---

## నవమాధ్యాయము

### పరాక్రమము ౨

నాల్గవనాఁటి యుద్ధంబున కౌరవసేనలు ఘటోత్కచుని మాయాప్రభావంబున మిగుల జేడ్పడెను. ఐదవనాడును పాండవులే మేలు చేయఁగఁబోరిరి. అఱవదినమున పాండవులు పరాక్రమించి కౌరవసేనలం జుట్టుముట్టఁగా భీష్ముఁడువిజృంభించి పాండవ వ్యూహమును జీల్చి తన బలంబుల రక్షించుకొనెను. ఈపరాభవమును సహింపఁజాలక యారేయి దుర్యోధనుఁడు భీష్ముని చాలికిం జని 'నీ వుపేక్షించుటచే నింత మూడుచున్నది; విక్రమించి వైరులం గెలువు' మని ప్రార్థించెను. భీష్ముఁ డట్లే యని చెప్పి మరునాఁడు సప్తమదివ

సంబునఁ జెలరేగి పాండవ సేనలఁ జిక్కుపరచుచుండ నర్జునుం డాతని దెస కుఱికి యెదుర్కొనెను. ధర్మజుం డిది గని యాతనికి భీమమాద్రేయులతో సహాయ్యం డయ్యెను. శాంతనవుం డిట్లు పాండవ పంచకంబుచేఁ బొదువం బడియు వెఱచఱవక వేడి మిగిలి వాఁడినారసంబుల వారినెల్లర నొప్పించుచుండెను. ఆ తుముల సంగరంబుల ధర్మజుఁడు భీష్మునిచే విరథుండై మాద్రేయుల యరదం బెక్కినవారింగూడ నాతఁడు నిశితశరంబుల నొప్పించెను. అంత ధర్మరాజు చేయునది లేక తన సేనల నూల్కొల్ప వారెల్లరు నుత్సాహంబున నొక్కపెట్టుగ భీష్మునిపై బడిరి. ఆతండును పిఱుసనక రోషాతిశయంబున ద్విగుణిత వీర్యుండై నలిరేగి బాణంబుల దీయుటయు, దొడుగుటయు, నేయుటయుఁ గానరాక శరవర్షంబుల గురియుచు, నా రాజలోకంబున నెల్లఁ బెక్కు మృగంబుల మార్కొనిన సింగంబు చందంబున పొడవడచు చుండెను. పాండవులు వెరగుపడి, వెరవుచెడి చూచుచుండ శిఖండి ధీరుఁడై యాతని నెదుర్కొనెను. భీష్ముఁ డాతనితోఁ బోర నొల్లక యావలి కొత్తిగిలి మఱియొక దెస నరుల నలయించు చుండెను. ఇవ్విధంబున రణం బత్యుగ్రంబైన సమయంబున నెత్తురులు వరదలు గట్టెను. సూర్యుం డస్తాద్రి కేగెను అంతతో నుభయ పక్షంబులును శ్రాంతులై నాఁటికి యుద్ధంబుపసంహరించిరి.

ఎనిమిదవనాఁటి కయ్యంబున పాండవులు మహోత్సాహంబునఁ దలఁపడి శత్రుభంజనము గావింపఁ దొడఁగిరి. కౌరవులు వారి తైక్ష్ణ్యంబునకుఁ దాళజాలకుండిరి. భీష్ముండును వారింపజాలఁ డయ్యెను. సంధ్యాసమయ మగునప్పటికి గౌరవులు గీడ్పడి హతాశులై యాలము చాలించిరి. అంత నుభయ బలంబులును శిబిరంబుల కరిగెను.

నాఁటి రాత్రి దుర్యోధనుఁ డత్యంత విషాదుండై కర్ణసౌబ

లులం బిలిచి రహస్యంబుగా 'భీష్మాదులు పాండవుల పట్ల ప్రేమచే పరాక్రమింపకున్నవారు; మన బలంబులు క్రమముగాఁ గృశించు చున్నవి; ఏమి యుపాయ' మని యడిగెను. కర్ణుఁడు కురువీరనిరూపణసమయంబున నర్ధరథుఁడుగమాత్రమే చెప్పబడినందుల కాతనితో గయ్యమాడి భీష్ముఁడు వడునంతదాక ఖడ్గము ధరియింపనని ప్రతిజ్ఞ జేసియుండెను. కావున రారాజుతో 'రాజా! భీష్మ నీపాటికి యుద్ధమునుండి తొలఁగుమనుము? పాండవసేనల యుద్ధృతి నే నడంచువాఁడ' నని దర్పముతోఁ బలికెను. శకుని యౌ ననెను. అంత నాతఁడు నిశథంబున భీష్ముని కడకుం జని యాతనితో నిట్లనెను.

* మ. నిను మున్నెంతయు నమ్మి పాండవుల యున్మేషంబు నేఁజీరికిం
గొన, నీ పోరెడు చందముల్ దెలియఁ బెక్కుల్ సూచితినింజేరిచే
రి నయుంబిచ్చుచు నొంపనూలొ్కనక వారిం బట్టిపాలార్చె దొం
డన నేరం గురుముఖ్య! యింక నిట నీ వాలంబు సాలింపవే.

చ. అనిమొన దేవదానవులకైన నను మార్కొనరాదు నిన్ను నేఁ
డెనిమిది నాళ్ళులయ్యెఁ సమయింపవు నొంపవు సవ్యసాచి; న
ప్పని యిటులుండనిమ్ము; నినుఁబ్రార్థన సేసెద నింతవట్టునా
చనవునఁ బోవఁబిచ్చి నృపసత్తమ! పోరికిఁ గర్ణుఁ బంపవే. *

'అయ్యా! నీ పరాక్రమంబును నమ్మి నే నిందాక నర్జును నిర్లక్ష్యించితిని. కాని నీ సంగ్రామంబుఁ జూచితిని. నీ వరుస తెలియ వచ్చినది. నీవు పాండుపుత్రుల జోలికిఁ బోనైన బోవు. నీవు దేవతలకైన నజేయుండవు. నీకు సవ్యసాచి యన నెంత? కాని నీ వాతని నొంపవు. అలయింపవు. ఉపేక్షింతువు. నిన్ను ప్రార్థించెదను. నాయందు దయయుంచి నీ వింతటితో రణంబు విరమించి కర్ణునిం బంపుము. నాకు శుభంబగును.' ఈ మాటలకు భీష్ముఁడు మనమ్మున వాలమ్ములు గ్రుచ్చినట్లు మిక్కిలి నొచ్చి కోపవిషాదంబులు పెనఁ

గొన నిట్టూర్పు పుచ్చి యిట్లు వాక్రుచ్చెను. "ఓయీ! నీకై ప్రాణంబులకుఁ దెగి శక్తికొలఁది శాస్త్రవుల నాజిమాడు చుండఁగా నా భక్తిం దలంపక యిట్లు నొవ్వనాడుదువే? అర్జునుఁ డనఁ నేమిగాఁ దలంచితివి? ఖాండవదహనమునాడు మాయాపరాహోర్ధము, ఘోష యాత్రపట్టున ఉత్తర గోగ్రహణంబున నాతఁడు ప్రదర్శించిన పరాక్రమము నీ వెఱుంగనిదే? ఇన్నాళ్ళు నేనోపికకొలంది నొడలు దాచక పోరినను నా సేనల గణింపక నన్ను వేఁడిపలుకు లాడుచున్నాఁడవు. నీవు పాండుసూనులతోఁ గయ్యంబునకుఁ బూని తగని పనికి దిగితివి. వట్టి మాటలతోఁ గార్యముకాదు. ఇఁక కన్పట్టి రణరంగంబున నీ మగఁటిమి చూపుము. నేను గాండీవిని గెలువనోపను. శిఖండి నేయ నొల్లను. ఇతరుల నెంతరినైన సరకుసేయను. ఇక నేనును నా దళములును ద్రుపద విరాటులను దలఁపడుదుము. మీ రెల్లఱు పాండవులతో బోరుఁడు."

"ఆ. నడికి రేయి వచ్చి నను నొవ్వఁ బలికినఁ
గలుగు నయ్య జయము? గడఁగి నీవు
నడవు మనికి; నెల్లి నాచేతి బంటుపు సూ
చెదవు గాక, వేయుఁ జెప్ప నేల?"

"మఱియు నీవు నడిరేయి నను నొవ్వఁ బలికినంత మాత్రమున జయము సిద్ధించునే? యుద్ధావనికి నడువుము; పరాక్రమంబు నెఱపుము. రేపు నాప్రతాపంబు గూడఁ జూచెదవుగాక." సుయోధనుఁడీ పలుకుల కెంతయు నలరి తన నగరున కరిగెను.

తొమ్మిదవనాటి యుదయంబున భీష్ముఁడు శిఖండిబారిం బడకుండ నిరువదివేల యాశ్వికుల నంగరక్షకులుగా నియమించి కురురాజు మహోత్సాహంబు మెఱయ సంగరరంగంబున కరిగెను. భీష్ముఁడు సర్వతోభద్రవ్యూహముం బన్ని, కృపకృతవర్మాదులతో ముందఱ

నిలువంబడెను. పాండవులును తదనురూపంబగు మేలిమోహరంబును బన్నుకొని మహాసంరంభంబునఁ గురుబలంబులఁ గవిసిరి. అభిమన్యుఁడు ప్రచండశౌర్యంబున దీపించుచుండెను. అర్జునుఁడు ద్రోణునిం దలఁపడెను. భీముఁడు గదోత్సవంబు నెఱపుచుండెను. అట్టితఱి భీష్ముఁడు తీవ్రప్రతాపంబున ధర్మతనయునిపై నడరి నిశితశరంబుల నాతని నొప్పింపసాగెను. ధర్మజుఁ డాతని వేడిమికిఁ దాళఁజాలక సహాయంబునకై యఱచెను. దుష్టద్యుమ్నాదులు వచ్చి యడ్డుపడిరి. అంత నా యుభయబలంబులకును సందశికయ్య మయ్యెను. భీష్ముఁడుద్రేకించి యర్జునునిపైఁ గవిసి యాతని మేను కఠినమార్గణంబులఁ గప్పఁ దొడఁగెను. ఇంతలో పాండవబలంబు లొక్కుమ్మడి వచ్చి భీష్ముం బొదివెను. ఈదృశ్యముం గని కురురాజు భీష్మునికై శకుని దుశ్శాసనులను సాహాయ్య మంపెను. పెక్కువేల తురంగబలంబులను పాండవులపైఁ బురికొల్పెను. మార్తాండుండు నభోమధ్య మలంకరించెను. ఆసమయంబున భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిన నారసంబులను కిరణంబులు బరగించి పాండవానీకంబును గలంచుచుండెను. తమ నాయకుని ప్రతాపం బూతఁగొని కురుసేనలును విజృంభించెను. అంతట ప్రళయభయానకంబుగా సంగ్రామంబు వర్ధిల్లెను. భీష్ముండు మహోద్దండ భుజదర్పంబున విక్రమించి విద్యుల్లతవోలె, కొఱవి ద్రిప్పిన వడువున నన్నికడలఁదానయై రథంబులు నఱుమాడుచు, గజంబుల డొల్ల సేయుచు, నశ్వంబుల నుగ్గొనర్చుచు, పదాతులఁ బొడుచుచు వీరవిహారంబు సేయుచుండెను. అంత సమరావనియెల్ల, తునిసిన యవయవములును, విఱిఁగిన ధనుఃకాండములును, సగము చచ్చిన కాయంబులును, నఱవఱలైన యరదంబులును గలిగి భటుల యాక్రందరావములచేఁ బోరుకొనియెను. నేల యంతయు నెత్తురుకొల్లయ్యెను పాండవబలములు గంధగజక్రీడనంబున ప్రమోదువడు నుద్యానవనంబుమాడ్కి,

దావాగ్ని దరికొన్న శుష్కవనంబు వడువున రూపఱుచుండెను. అత్తఱి వారు చేయునది లేక దైన్యంబు నొందియు, కలగుండు వడియు, కోలాహలం బొనర్చుచు నిస్సహాయులై చెదిరిపోవుచుండిరి. శ్రీకృష్ణుం డీ యాపదఁ గనుంగొని,

"ఉ. అర్జున! చూచితే మన బలావళి నెల్లఁ గలంచుచున్నవాఁ
డూర్జితశౌర్య సంపదయు, నుగ్రభుజాబలవైభవంబు, వి
స్ఫూర్జిత విక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయదర్పవిభ్రమము దోఁపఁగ జేయక యున్కి యొప్పునే!

'అర్జునా! గాంగేయుండు తన శౌర్యసంపదను, దోర్బలంబును, విక్రమాతిశయంబును బ్రకటించుచు మనబలంబుల నెట్లు గలంచుచున్నాఁడో చూడుము. మన మొన లుక్కడక్కి చెదరుచున్నవి. ఇట్టియెడ నీవు నీదుర్దమ దర్పమును జూపకుండుట యుక్తమగునే? తొల్లి నీవు పలికిన బీరంబులు పొల్లొనర్తువే? విజృంభించి విక్రమంబుఁ జూపుము' అని పురికొల్పెను. పార్థుండును ధైర్యము దెచ్చుకొని యుద్రేకంబున భీష్మునుపయిం గపిసెను. తెరలిపోయెడు పాండవబలంబులును మరల గూడుకొని భీష్మునిం జుట్టుముట్టెను. భీష్ముండు నలిరేగి మహాస్త్రంబులు నిగిడించి యబ్బలంబు నిలువరించి క్రూరాస్త్రపరంపరచే గాండీవి యంగంబును గలయఁగుచ్చి, గోవిందుని నొవ్వనేసి, యశ్వముఖంబుల గాఢనాటెను. పార్థుని గుఱ్ఱములు బీఱువోయి మాఱుమొగము పెట్టెను. శ్రీకృష్ణుఁ డది గాంచి తనయులుకకు గలంగక, హస్తంబులతో నశ్వంబులఁ దడవి నూల్కొనఁజేసి తఱిమెను. పార్థుఁడు భీష్మునిచాపముం దునిమెను. భీష్ముఁడు మఱియొండు విల్లెత్తెను. కాని యదియుఁ గవ్వడిచే వ్రక్కలయ్యెను. భీష్ముఁ డంత తోఁకద్రొక్కిన పామువలె లేచి 'ఔరా! అర్జునా!' యనుచు వేరొక వింట వాలంప మొత్తంబుల సంధించి యాతనిపయిం

బరపెను. అర్జునుఁ డాశ్రితపం క్తిచే నొచ్చి చేష్టడి పోరఁజాలకయు పౌరుషమే బలముగాఁ బోరదొడంగెను. శ్రీకృష్ణుఁడు విప్పచ్చుఁడు నొచ్చుటయు, భీష్ముఁడు హెచ్చుటయు, నన్యులు దవ్వుదవ్వుల నిలుచుటయుఁజూచి దారుణరోషావిష్టుండై సైరణయుడిగి తేరి నొగల పగ్గంబు లునిచి, చక్రంబుదాల్చి, యిలపై కురికి సింహ నాదంబున భీష్మపయిం గవిసెను. ఆహా ? ప్రతినకు వ్యతిరేకముగా శ్రీకృష్ణుచే రెండుమారులు చక్రముఁ బట్టించిన భీష్ముని ప్రతాపాతిశయము వర్ణనీయము కదా ! అంత కురుబలములు ప్రాణము లెగిసిపోయినట్లు వెలవెలఁ బాఱుఁచు గలుగఁపడి 'భీష్ముండు పడె భీష్ముండు పడె' నని యట్టులెత్తి యఱచు చుండిరి. ఆ భయదసమయంబున భీష్ముండు బీఱు వోయెనా ; లేదు ! భీష్ముఁడు కృష్ణు నెఱుఁగును కృష్ణుఁడు భీష్ము నెఱుఁ గును కావుననే యూతఁడు చక్రమెత్త, నీతఁడు,

"చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లను : జనుదెమ్మ వేగమమహాత్మ! వికస్వర పుండరీకలో
చన ! యిది లెస్స; నాకిచట శాశ్వతిమైన, యశంబు, నచ్చట
న్వినుతికి నెక్కు సద్గతియు నీదయ జేకుఱఁ జేయుమిష్టమున్."

బ్రహ్మానందము నొంది సవినయంబుంగా 'మహాత్మా! వేగమ చనుదెంచి యిహంబున శాశ్వతయశంబును, పరంబున పరమో త్కృష్టగతియు నాకు దయచేయుము. ఇది నా యభీష్టము' అని పలి కెను. అంత నర్జునుఁడు రభసంబున రథంబు డిగ్గి శ్రీకృష్ణునివెంటఁ బరుగిడి యూతనిఁ గరంబులం గ్రుచ్చిపట్టి వారింపఁజూచెను. కాని యా శౌరి పెనఁగుచు మహాత్ముని భీష్మునిపై దుమకఁబోవ పరస్థైర్యం బును బాహు వీర్యంబును మెఱయ, మహీతలం బూని మెట్టి కృష్ణుని నిలువఁబెట్టి యిట్లనెను.

"ఉ. కయ్యము సేయ నే నని యకల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ

విద్యోడఁ దప్పి తేని జగ మేమను? నించుక సేపు పోరులన్
డయ్యట దప్పె? నాపయిఁగడంగిన భీష్ముని పాటుసూతు, రా
వయ్య! రథంబువిడ్వఁగి? కౌంతేయ మానము వీటిఁబుత్తురే?"

కృష్ణా! రణంబొనర్పనని త్రికరణంబులఁ బ్రతిజ్ఞ సేసియు నేఁడు తప్పితి వేని లోకమునిన్ను నవ్వదే? పోరిపోరి యించుక డస్సితిని. అదియు లోటగునే? నాపయిం గడఁగిన యీ భీష్ముని పాటు చూతువుగాక. దాసుఁడనగు నామానము నీటఁగలుపక రథంబధిరోహింపుము. రణోద్యమం బుడుగుము.' పార్థుని ప్రార్థనంబునకు శ్రీకృష్ణుఁడు ప్రియంబంది వెనుకకు మరలి యరదం బెక్కెను. అర్జునుండును దేరెక్కి భీష్ముని మేన శాతశిఖపుంజంబుల నాటఁదొడగెను. కాని భీష్ముఁడు మహోద్రేకంబున శౌర్యమూర్తియై మధ్యందిన మార్తాండుని వడువున ప్రజ్వలించుచు, ప్రళయకాలభైరవుం డగు పర్జన్యనికరణి గర్జిల్లుచు పటునారాచ పటనాసారంబు నిగిడించి వారల దిగులువడఁజేసి బలాఢ్యుఁడు చలిచీమలంబలె బాధసమరుచుండెను. అట్టియెడ కృష్ణార్జునులును, పాండవయోధ ప్రముఖులును జేయునది లేక నివ్వెరపాటుతోఁ జూచుచుండిరి. ఇంతలో ప్రొద్దు గ్రుంకెను. ధర్మరాజు బురదలోఁబడ్డ గోవులం బోలియున్న తన బలంబుల దుర్దశకుఁ బరితపించి, యప్పటికి రణభూమినుండి మరలుటయే కార్యముగాఁ దలంచి, సేనాపతులం గూడుకొని గాంగేయువలని భంగపాటునకుఁ గుందుచు పార్థప్రముఖులతో నిజశిబిరంబులకు మరలెను.

కౌరవులును నాఁటి విజయంబున కెంతయు గర్వించుచు భీష్ముని దుర్దాంతపరాక్రమంబు నగ్గించుచు సంతసంబున నిజనివాసంబుల కరిగిరి.

---

*

# దశమాధ్యాయము

## పతనము

నాఁటి నిశాసమయంబున ధర్మజుఁ డత్యంత విషాదయుతుండై యనుజ సహితంబుగా రహస్యప్రకారంబున శ్రీకృష్ణుని సన్నిధి కరిగి యాతనితో నిట్లనియెను.

"క. కార్చిచ్చు గవిసి మృగతతి
నేర్చు కరణి నేఁడు భీష్ముఁ డేచిన కడిమిం
జేర్చి మన సేనఁ బొదివె శ
రార్చుల, నవ్వీరుఁ గన్నులారం గంటే?

మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుర్మానంబునం జేసి యే
మును గార్యస్థితి గాననైతి, విను నిర్మూలంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యముఁ గొన్న యట్లగునె? నిశ్చింతంబునం గాననం
బునకుం బోయెదఁ దమ్ములం గొని, తపఃపూజ్యుండనై యుండెదన్.

క. మున్ను నః నే కారణముగ
నన్ని యిడుమ లనుభవించి రనుజులు, వీరిం
గన్నారఁ జూఁతుగాని జ
గన్నుత! భీష్మునకుఁ గోలుగా నీఁజాలన్."

కృష్ణా! నేఁడు భీష్ముఁడు కార్చిచ్చు మృగములం గాల్చినట్లు మన బలంబుల నెల్ల శౌర్యాతిరేకుండై గోలు మసంగినవాఁడు. ఆతని మనవా రెవ్వరు నెదుర్పజాలరు. అక్కటా! ఈవిధము మున్నుగ నే గుర్తెఱుంగక యీ యుపద్రవమునకుం బూనితిని. నిర్మూలంబుగా వంశనాశన మైనచో సామ్రాజ్యము చేపడినట్లగునే? తొల్లి నామూలమున నే కదా నాతమ్ము లడవులలో నిడుమలం గుడిచిరి? వారినిఁ

గన్నులతోఁ జూచుకొనుచుండు. అంతియే కాని యీభీష్మ సింహంబున కెఱగానర్పింపఁజాలను. కృష్ణా! నాకీ బెడఁద యంతయు నేల? హాయిగా మరల నెప్పటియట్ల తమ్ములతోఁ గానల కరిగి తపశ్చర్యం దినములు గడపెదను. నీకు మాయం దనుగ్రహము గలదేని కర్తవ్యముదక్క-ధర్మవిరోధంబు కాని తెరువు మా కుపదేశింపుము. కృష్ణుఁ డీ వేడికోలును సాదరంబుగా విని సాంత్వనవచనంబుల ననునయించి యిట్లని పలికెను. "బావా! నీవు సత్యప్రతిజ్ఞుండవు; నీ యనుజ లత్యద్భుత బాహువీర్యులు; నేను సచివుండనై రాజ్యం బొనర్తు. ఇట్టియెడ నీకొండు దుస్స్థితి గలుగనేర్చునే? భీష్మునిం బిలుకు మార్పలేదని వగవకుము. రేపు పార్థుం డాతనిఁ గడతేర్పకున్న నేనాతని మడియించి నీకార్యంబు దీర్చెదను.

"గీ. సఖుఁడు, సంబంధి, శిష్యుండు సవ్యసాచి
నాకు, నతనికి నై యేను నరవరేణ్య!
కూర్మిమై గండలైనను గోసియిత్తు
నరయ నాతండు నాయెడ నట్టివాఁడ."

"కృష్ణార్జునుల మైత్రి యెట్టిదిగాఁ దలంచుచుంటివో ఆతఁడు నాకు నెచ్చెలి, చుట్టము, శిష్యుఁడు. ఆతనికై నేనును, నాకై యాతఁడును మేనికండలైనఁ గోసి యిత్తుము. అతని ప్రతిన నేనును, నాప్రతిన యాతఁడును దీర్చుటకు నియమంబు గలదు. సంజయాదులకడ నాఁడు మే మిరువురము నాడిన బీరంబులఁ బాలింపవలయును." ధర్మరాజీ పలుకులు విని 'అయ్యో! గయ్య మెట్టి దుర్గతి గలిగించె? కయ్యంబున గెలుపుగొనుటకై నే నియ్యెడ నీచే బొంకింతునే? యుద్ధారంభమున దేవవ్రతుండు నా కొక్క వరం బొసంగె. ఆతఁడు కౌరవపక్షంబునఁ బోరుటకును, మనకు హితంబు పూనిచేయుటకును గృతనిశ్చయుండయ్యె. నా కతఁడు రాజ్యం బొసంగగలఁడు' అని పలికి సఖేదంబుగా,

"ఆ. అకట! తండ్రి సచ్చినంతనుండియు మము
నరసి ప్రోచినట్టి యనుఁగుఁదాత
జంప మదిఁదలంచు తెంపు సూచితె? రాజ
ధర్మ మింత క్రూరకర్మ మగునె?"

'అక్కటా! మేము తండ్రిలేని బిడ్డల మైన నాఁటనుండియు మమ్మపార ప్రేమతో నెవ్వఁడు పెంచి రక్షించెనో యట్టి యనుఁగు తాతనే నా మనస్సు చంపఁదలచుచున్నది. హా! రాజధర్మ మెంత దారుణ కర్మము?' అని నిట్టూర్పు పుచ్చెను. శ్రీకృష్ణు డీ పలుకులు విని ధర్మజుఁడు భీష్ముని చెంత కరుగ నెంచినాఁడని యూహించి 'రాజా! నీ తలంపు లెస్స. భీష్ముం డలుక గదిరి, యని మొన నిలిచెనేని దేవేంద్రాదులకైన నెదుర శక్యమే? నీ వాతని నిజవధోపాయం బడిగిన జెప్పును కావున నీవును, నేనును, నీ తమ్ములును రహస్యప్రకారంబున నరిగి యతివినయంబున హితమార్గముం జూప బ్రార్థింతము. ఆతని సదయమంత్రోపదేశంబు ననుసరించి మెలంగుదము. సర్వమును జక్కం బడునని చెప్పెను.

ఆ రాత్రియే పాండవులు శ్రీకృష్ణసహితులై యతి నిగూఢంబుగా భీష్ముని సన్నిధి కరిగి యధిక భక్తితో నాతని కభివాదంబులు సేసి వినమితాంగులై నిలిచిన నమ్మహాత్ముండు సంతసిల్లి యత్యాదరంబున నెల్లరఁ గుశలప్రశ్నంబు లడిగి యుచితాసనంబులఁ గూర్చుండ నియమించి 'మీ రందఱు నీ నడిరేయి నిచ్చటికి వచ్చిన పని యేమి? మీ కోరిక దుష్కరమైనను సరే సంతసంబునఁ దీర్చెదను. సందేహము మాని సత్వరమ యెఱింగింపుఁడు,' అని పలికెను. ధర్మనందనుఁ డందులకు దీనాననుండై 'తాతా! నీకు మాయందుఁ గల ప్రేమాతిశయంబునం జేసి మా కెట్లు సామ్రాజ్యంబు చేపడునో, మా సమధిక సైన్యంబు లెట్లు సమసిపోకుండునో యా యుపాయముం బోధింపు'

మని వేడెను. దానికి భీష్ముఁడు 'కుమారా! నేఁ బోరినచో నీకు రాజ్యమూ లభింపదు ; సైన్యమూ క్షీణించును ; కావున నన్ను దొలుత నిర్జింపుఁ' డని చెప్పెను. అంతట ధర్మజుండు,

"ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేతి త్రిశూలము డాఁచి లీలమై
వచ్చిన రుద్రుచందమున వ్రాలుదు వీవనిలోన, నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టి మగవారికి? నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి, మెవ్విధిన్ గెలువవచ్చు మహాత్మ! యెఱుంగఁ జెప్పవే?"

'మహాత్మా! నీవు, ఫాలనేత్రము మూసికొని త్రిశూలమును దాఁల్చివచ్చిన రుద్రుని చందంబున, సంగ్రామంబున విజృంభింతువు. నిన్ను మార్కొని యోర్వఁగల మగవాని నెందును గానజాలము. నీ దయను గోరి వచ్చితిమి. నిన్నెట్లు గెలువవచ్చునో యనుగ్రహించి సెలవిచ్చి మమ్మొక యొడ్డు జేర్పుము.' అని యతి దైన్యంబునఁ బ్రార్థించెను. గాంగేయుం డందుకు 'వత్సా! నీ వాడినది నిజము. నాచేత ధనువుండగ నన్ను దేవతలైన నోడింతురే? మీరు నాసత్త్వము గుర్తెఱింగి యిచ్చుటికి వచ్చి మంచిపని కావించితిరి. ఆహా! మీ రెల్లరును వచ్చి నన్నిట్లు గోరుచుండ నంగీకరించుటకంటె నా కొండు సుకృతంబు గలదే? నేను విల్లంబులు విడిచినప్పుడు మీకు జయంబు చేకూరును. నేను నిష్కవచుని, నిరాయుధుని, నిర్ధ్వజుని, అంగనను, అంగనాపూర్వుని, అంగనాభిధానుని, ఉష్ణీషహారహితుని, భ్రాతృవిహీనుని, అపుత్రకునిం గనినచో సమరంబు విరమింతును. (ఆహా! ఏమి యీ యుదారహృదయము! ఇట్టి కోమలభావము మీ యోధునకు గాక మఱి యే యోధునకు గలదు?) మఱియు నా కొక్క వ్రతము గలదు. అంగనయై పుట్టి నడుమ దైవవరంబున పుంస్త్వముం బొందినవానితోఁ బోరొనరింపను. కావున మీ కొక్క యుపాయముం జెప్పెదను. ద్రుపదతనూజుం డగు శిఖండి యట్టివాఁ డగుట మీ రెఱుంగుదురు

గదా! అతఁడు విశేషించి పూర్వజన్మమున నాఁడుది యగుట నాతనికి రణంబున నెదురేయను. అర్జునుం డాతని బురస్కరించికొనివచ్చి నే నూరకున్నసమయంబున నన్ను నిశితాస్త్రంబుల నొప్పించి పడవైచి నచో నావల మీరు ధార్తరాష్ట్రుల గెల్చుట సుకరం బగును.' అని ప్రియంబున వచియించెను. ఆహా! ఏమి యీ త్యాగము!

భీష్ముని యీ నిరుపమత్యాగము స్థూలదృష్టి కొక లోపముగా గన్పట్టవచ్చును. కాని యిటు చూడుఁడు. ఆయన జీవిత మిప్పుడు ధర్మ స్వధర్మములకు సంగ్రామరంగ మైనది. ఆయన, మనము పూర్వము గ్రహించినట్లు స్వధర్మము ననుసరించి కురుపక్షముం బూనెను. ఆయన కిప్పుడు కౌరవపక్షమునఁ బోరుట స్వధర్మము; పాండవ హితము గూర్చుట ధర్మము. నిప్పు నీరుల యన్యోన్యముగల యీ యుభయము నాయన పాలింపవలసినదే. దేనిని విడనాడినను గర్తవ్యము దప్పిన ట్లగును. ఈక్లిష్టసమస్య నాయన యెట్లు విడదీసెనో, ఈభిన్న ధర్మములు నాయన యెట్లు సమన్వయించునో గమనించితి మేని నట్టి సందేహమున కెడముండక యీ మహాపురుషుని ధర్మాను రాగమును, స్వధర్మపర్వతమును, ప్రతిభావిశేషమును, ధర్మాభిజ్ఞత యు, నౌదార్యమును దేటపడఁగలవు.

ఆయన స్వధర్మమును ధర్మమునుగూడ నర్వాముగా నిర్వహింప నిశ్చయించెను. ఆయన నిర్ణయమును మనము గ్రహింపగోరుదుమేని ప్రథమమున ధర్మస్వధర్మముల తత్త్వమును, తారతమ్యమును గుర్తెఱుఁగవలెను. ధర్మము దైవకల్పితము. స్వధర్మము మానవకల్పితము; ధర్మము విశ్వజనీనము, స్వధర్మము వ్యక్తిగతము; ధర్మము సార్వకాలికము, స్వధర్మము తాత్కాలికము; ధర్మము నిర్వికారము, స్వధర్మము సవికారము; ధర్మము నిష్కళంకము, స్వధర్మము క్వచిత్కళంకము; ఉభయమును పావనములే, కాని ధర్మము పావనతరము

ఉభయమును గణ్యములే కాని ధర్మము గణ్యతరము. ఈ యుభయ మును మానవునకు సమానముగా నవశ్యాచరణీయములే. దేనిని విడ నాడినను కృతార్థుఁడు కాఁడు. దేనిని విడనాడినను ముక్తిలేదు. ఈసత్యమును పరికించినచో నన్యోన్య భిన్నములగు ధర్మస్వధర్మము లను సమాధానపఱచుటకు స్వధర్మమును సర్వదా నిర్వహించుచు ధర్మోపద్రవము వచ్చినప్పుడు స్వధర్మమును బరిత్యజించియైన ధర్మ మును బాటించుటయే పరమకర్తవ్యమని మనము గ్రహింపఁగలము. భీష్ముఁ డిట్లు తలంచియే కౌరవపక్షమునఁ బోరి స్వధర్మమును దీర్చుట కును, సమయమైనచో సమరము విరమించి—స్వధర్మము పరిత్యజించి ధర్మముం బాటించుటకును నిశ్చయించుకొనెను. శ్రీకృష్ణుఁడును ఇట్లు తలంచియే నిజప్రతిజ్ఞావ్యతిక్రమమైనను రెండుమారులు చక్రము పట్ట సాహసించెను. అయితే భీష్ముని మార్గోన్నసంధిగ్ధస్థితి యీస్వధర్మ పరిత్యాగముతోఁ బోలేదు. ఆ మహనీయుఁడు మహోత్తరమును పావనతమము నగు మఱియొక నిరుపమత్యాగము నొనరించి యిహ మునఁ జిరతరకీర్తిని, పరమున శాశ్వతసుఖమును బడయవలసి యుం డెను. అస్త్రధారియగు భీష్ముఁడు రణరంగమున నిలిచినంతకాలము పాండవులకు విజయ మలభ్య మగుటచే నాఁడు నిజవధోపాయం బెఱింగించి పాండవులను—ధర్మమును గెలిపించుటకు కృతనిశ్చయుఁ డయ్యెను. ఆహా! ఆతఁడు ధర్మమున కాహుతి యగునుగాని ధర్మ మును దప్పఁజాలఁడు! ధర్మహితార్థమగు నీ యాత్మత్యాగము సర్వదా సంస్తుతి పాత్రము గాదే!

ఇఁక భీష్ముఁడు తన మనోనిశ్చయము నెట్లు నిర్వహించెనో గమనించెదము గాక. యుద్ధారంభమున నిజసంహారోపాయము నెఱిం గింపఁ గోరినప్పుడు భీష్ముఁడు శస్త్రసన్యాసం బొనరించిన గాని యవ ధ్యుండననియు, నిఁక ప్రశ్నించుట కిది సమయము గాదనియు జెప్పి

పంపెను. ఏమీ? అప్పుడే యేల చెప్పరాదు? ఈవాక్యము భీష్ముని స్వధర్మబద్ధత్వమును బ్రకటించుచున్నది. అదియే రణప్రారంభము. శత్రుసంహార మింకను జేయలేదు; కురురాజు ఋణమును—స్వధర్మము నింకను దీర్చలేదు. మఱియు ధర్మమునఁ కెట్టి సంకటమును గలుగలేదు. కావున నప్పుడే యాత్మవధోపాయము జెప్పుట స్వధర్మవిద్రోహమగును. అందుచే గొంతకాలము సైచి కష్టసమయముననే తన వద్దకుఁ జనుదెమ్మని ధర్మజునకుఁ జెప్పెను. ధర్మజుఁ డట్లే తన కష్టసమయమున ధర్మహాని వాటిల్ల నున్నప్పుడు భీష్ము దర్శించి నిజవధోపాయముం బ్రార్థించెను. ఆయన యట్లే బోధించెను. భీష్ముని యీనిర్దుష్టనిరుపమ త్యాగమునకు మాహాత్మ్యము మసి పూయకుండునుగాక! పాపము శమించుగాక!

పాండవు లీ తరుణోపాయంబునకు సంతసిల్లి, పితామహునకు నమస్కరించి, వీడ్కొని, విడిదలకుఁ బోవుచుండగా నర్జునుఁడు భీష్ముని మరణనిశ్చయమునకును, దాను కృత్రిమంబునఁ జంపవలయుటకును శోకాకులుండై శ్రీకృష్ణునితో నిట్లనియెను.

"క. గురునిఁ గృతప్రజ్ఞుని ధ
ర్మరతు వయోవృద్ధు లోకమాన్య దయాళున్
సురతటినీసుతు వంచనఁ
బురుషోత్తమ! చంప బుద్ధి పుట్టదు నాకున్.

ఆ. నన్నుఁ బాంశు కేలి నున్న నర్మిలి నెత్తి
మేనధూళి దనదు మేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి మా తండ్రిగుణము ల
గ్గించి కన్ను నీరు నించు నతఁడు.

ఉ. అక్కట! తండ్రిలేనిమము నమ్మెయిఁ బెంచిన తాతనిమ్మెయిం
ద్రెక్కొనఁగా, దతండు సముదీర్ణ భుజాబల శౌర్య శాలియై

యిక్కడిసేనఁ జక్కడిచె నేనియుఁ జూతునకాక ధర్మముం
దక్కుటకోర్వఁజాలుదునె? ధర్మజుతమ్ములు క్రూరకర్ములే?"

"కృష్ణా! గురుఁడు, ప్రజ్ఞాశాలి, ధర్మపరుఁడు, వృద్ధుఁడు, లోక మాన్యుఁడు, దయాళుఁడు, నగు దేవవ్రతుని వంచనచే వధించుటకు నాకు బుద్ధిపుట్టకున్నది. ఈతఁడు చిన్నతనమున దుమ్ములో నాడు కొనుచుండు మమ్మును గూర్మిమై నెత్తికొని మాయొడలి ధూళి తన మేన నంటఁగాఁ గౌఁగిలించుకొని మా తండ్రిని స్మరించి యాతని గుణములఁ గొనియాడి కన్నుల నీరు పెట్టుచుండెడివాఁడు. అక్కటా! పితృవిహీనులగు మమ్ము నట్లు పెంచిన యీతని నే నెట్లు వధింతును? ఈతఁ డుక్కు మిగిలి మా సేనలఁ జక్కడంచుఁగాక! చూచుచు నూరకుందును. అంతియే కాని పాడి తప్పి కూర్మితాతను జంపనొల్లను. ధర్మరాజు తమ్ము లంతటి క్రూరకర్ములు కారు." కృష్ణుఁ డీ చింతా వాక్యములు విని 'ఓయీ! క్రూరత చూడక శత్రువుల వధించి కప్పములు గొనుచు ప్రాజాభ్యుదయ మొనరించుట భూనాథుల కవశ్య కర్తవ్యమని పెద్దలు వక్కాణింతురు. మఱియు,

"చ. అనిమొన నోర్తు భీష్ముననియాడిన నీదగుపూన్కి లోక మె
ల్లను వినియుండఁగానిటుచలంబెడలం జన; దెట్టులైనఁ జం
పన తగు; రాజధర్మ పరిపాలన గాకిది క్రూరకర్మమే?
నిను విధిపంచె శాంతనవునిం దెగటార్పఁగ వేయు నేటికిన్?"

'అర్జునా! తొల్లి నీవు రణమున భీష్ము నోడింతునని పలికిన ప్రతిజ్ఞ లోక మెల్లెడను వెల్లడియై యుండఁగా నీ విప్పట్టున చలము విడచి పూన్కి దప్పితివేని నగుబాటుకాదె? నీవు భీష్మునిఁ జంపక తప్పదు. ఇయ్యది రాజధర్మపరిపాలనము. అంతియేకాని నీవన్నట్లు క్రూరకర్మముకాదు. శాంతనవునిఁ దెగటార్చుట నీకుఁ గర్తవ్యము. దైవము నిన్నిందుల కనియే పంపినాఁడు. నీవు శంకదక్కి యీ భీకర

శత్రువుం దునిమి విజయమార్గములు నిష్కంటక మొనర్పుము.' అని హెచ్చరించెను. అందుల కర్జునుఁడు 'మనశిఖండి భీష్మవధార్థంబే యవతరించెనని వింటముకదా! నేను భీష్మునితోఁ బోరువిధమున పురిగొని యన్యుల నేయుచుందును. అనితర వధ్యుండగు భీష్ముని శిఖండి మార్కొనును. భీష్ముఁడాతనిపై శరంబులు వైవఁడు. శిఖండి యాతని నెట్లును ఖండించును. కావున నేనాతనిం గవియు నగత్యము లే' దని యెను. శ్రీకృష్ణుఁ డందులకు నవ్వి 'పార్థా! నీవొక్కఁడవు తప్ప నెవ్వఁడును భీష్ముని బడ నేయఁజాలఁడు. అతనికి నీచేతనే మరణము లిఖింపఁ బడి యున్నది. కావున నన్యసందేహంబు లుడిగి కృతనిశ్చయుండవు కమ్మని ప్రోత్సహింప నర్జునుఁ డయ్యవసరముంబట్టి నడచెద నని యియ్యకొనెను. కృష్ణుఁడును, ధర్మరాజాదులును సంతసిల్లి నిజశిబిరంబుల కరిగి సుఖముగా నిదురించిరి.

తెల్లవారెను. రణము మొదలిడి యది పదియవ దివసము. ప్రభాకరుఁ డప్పుడే సమరాలోకన కుతూహలుండై పూర్వాద్రి నలంకరించి కాయమబ్బుల మఱుఁగునుండి తొంగి చూచుచుండెను. కురుక్షేత్రరంగమున నొకవైపున కౌరవ వాహిని భీష్ముఁ డెప్పటియట్ల గ్రేసరుఁడుగా బారులు దీరియుండెను. దుశ్శాసనాదు లాతని కంగరక్షకులుగాఁ బరివేష్టించి యుండిరి. ద్రోణుఁడును, ద్రోణపుత్రుండును నాతని కిరుగెలఁకుల నిలిచియుండిరి. కురుసైన్య కదంబము లెల్ల మహోల్లాసముతో సంగ్రామముఁ బ్రతీక్షించుచుండెను. వాని కభిముఖముగా నావల పాండవసేనాంగంబులు శిఖండి యగ్రపద మధిష్ఠింప భీమార్జును లుభయ పార్శ్వంబులఁ గాచియుండ నవీనోత్సాహంబున మెఱయు చుండెను. అంత శంఖ తూర్యారావంబులు చెలంగ నిరువాగులును శౌర్యాతి రేకంబునం దలఁపడిరి. ఆనాఁడు జరిగినది నిజముగా దేవదానవ యుద్ధమే. నకులసహదేవులు విజృంభించి కురుబలంబుల నురు

మాఁడ దొడఁగిరి. భీముఁడు ప్రళయ భైరవ భీమాకారుండై శత్రు వీరుల సడమడము చేయుచుండెను. భీష్ముఁ డది సహింపనేరక ప్రచండ శౌర్యుండై పరాక్రమించెను. ఆతని ధాటికి దాళజాలక పాండవులు చతురంగబలంబులును పలుచఁబడుచుండెను. అది గని శిఖండి తత్క్షణమే భీష్మునే గదిసి యాతనిపైఁ గ్రూరాస్త్రంబులఁ బరపి నొప్పించెను. కాని యా మహావీరుఁ డాతని శరంబుల లక్ష్య పెట్టక యాతని దిక్కుఁజూడక మందహాసంబున నాతని నుద్దేశించి 'నా పగదాన వగు నిన్ను విధి మగవానిఁగా జేసెను. నీవు నాపై నెన్ని బాణంబులు బరపినను నీతోడఁ బోరుసలుప నొల్ల' నవియెను. శిఖండి యందులకుఁ గోపించి పరుషవాక్యంబుల రణమునకై పురికొల్పుచు నావీరునిపైకిఁ గవిసెను. అర్జునుం డాతని ప్రోత్సాహవచనంబులను ద్రేకింపఁజేయుచు భీష్ముని మఱిమఱి గదియఁ జేయుచుండెను. అంత భీష్ముఁడు తొలఁగి పాంచాలబలములపైఁబడి వారిం గసిమసంగఁ దొడంగెను. అర్జునుం డాయదను గొని కురుసైన్యంబుల నుగ్గునూచఁగా జేసి గగ్గోలుపరుపసాగెను. కురుపతి యా కల్లోలముం గాంచి భీష్మునికడ కేగి 'యవార్యశౌర్యుఁడవగు నీ వుండఁగ మన బలంబు లిట్లు దైన్యము నొందఁదగునే?' యని దీనముగా బ్రార్థించెను. భీష్ము డందుకు 'కుమారా! నేను తొల్లి పదివేల భటులను జంపుదునని మాట యిచ్చితిని. నా బాస తీర్చికొంటిని. నా బల మిఁక నుడుగునట్లున్నది. నేఁటిరీతి చూడ పాండవులచే నేనో' నాచే వారో నమయున ట్లున్నది. అమానుషవీర్యధుర్యులగునా కౌంతేయు లొక మర్త్యునిచేతఁ జత్తురనుట కల్ల. అయినను నాచేఁతిబలువు చూతువుగాక' యని పలుకుచువిజృంభించి పటుతరశరార్చుల పాండవవీర యూథంబులఁ బొదవికొని తేఱి చూడరాక నిర్ధూమదహనుండునుం బోలెఁ దేజరిల్లుచుండెను. కౌరవయోధు లాతని ప్రాపున శత్రుబలం

బుల బడలువడఁ జేయుచుండిరి. దృష్టద్యుమ్నుఁడును 'పార్థుఁడుండ భయమేమి? భీష్మునిం జట్టుముట్టు' డని సైన్యంబులఁ బ్రేరేచుచుండెను. అర్జునుఁడు శిఖండిని ముం దిడికొని యాతని నూల్కొల్పుచు భీష్ముని దఱియుచుండెను. అంత దుశ్శాసనుం డాతని కడ్డుపడి వాలమ్ముల నొవ్వఁ జేయఁగా ఫల్గునుండు ప్రతి విశిఖంబుల నాతనిఁ దూలనేసి భీష్ముని ముందటి బలములనెల్లఁ జిందరవందరగఁ జేయుచుండెను. ఈ యుపద్రవముం గాంచి ద్రోణుఁడు తన ప్రాణమిత్రునికి సాహాయ్యము రానెంచెను గాని ధర్మజుం డాతని నెదిరించెను. కురుప్రముఖు లనేకులు భీష్మునికిఁ దోడ్పడ వచ్చిరి. కాని యొక ప్రక్క భీముఁడును, నొక్కెడ నర్జునుండును వారిం దలఁపడి ప్రచండ కాండంబుల నొప్పించుచుండిరి. కురురాజిది గాంచి మఱియు ననేక బలంబుల భీమార్జునులపైఁ బంపెను, కాని దృష్టద్యుమ్న సాత్యకిప్రముఖులగు రథికవరు లావీరద్వంద్వమునకుఁ దమ సైన్యములతో బాసటయైరి. పాండవు లిట్లు పెచ్చుపెరుగుటఁ జూచి భీష్ముం డసహిష్ణుండై మృత్యుదేవతయుంబోలె నరి బలంబుల నురుమాడఁదొడంగెను. ఇట్లు మించి సింహశౌర్యంబున నపరాహ్ణం బగువఱకుఁ బరాక్రమంబు నెరపి యాత్మ గతంబున,

"గీ. ఉత్తమ క్షత్రియుల నెల్ల నగ్రవృత్తి
నేఁడు పదినాళులేని నా నిశితశరచ
యములఁ గూల్చితి, వేసరి నట్టు లయ్యె
మేనితోడి పొత్తిం కిట మాను టొప్పు"

'ఈ పదిదినంబులు నగ్రవృత్తుండనై యుత్తమక్షత్రియులఁ నెందఱినో నా క్రూరశరంబుల కెఱగావించి విసివితిని. ఇంక శరీరపరిత్యాగంబు చేసిన బాగుండు' నని చింతించి ధర్మజుం జేరి యాతనితో నిట్లనెను. అనఘా! పుట్టినప్పటినుండియు దారుణతరంబగు రాజవ

ధయుండే కాలము గడపితిని. ఇంక నీ యాసురకర్మంబునకు నామనం బొల్లకున్నది. కుమారా! మీరు నాహితము గోరుదురేని తడవు సేయక శిఖండి మున్నుగా నన్నుం బొదివి పడవేయుండని చెప్పెను. అది విని ధర్మరాజు దగ్గఱనున్న దృష్టద్యుమ్ను నవలోకించి 'భీష్ముని పలుకులు వింటిమిగదా: మనయోధుల నెల్ల రగూడం గట్టుకొని మూంత నివయిం బురికొల్పుచు నీవును భీముండును నర్జునునకు సహాయ్యులరై భీష్మునిం జుట్టవేయుండని హెచ్చరించెను. అట్లే యావీరత్రయమును భీష్మునింపై విజృంభింప నశ్వత్థామాది కౌరవవీరులు వారి కడ్డమై పోరందొడంగిరి. పార్థుండు శత్రుసైన్యంబుల నుగ్గాడుచు శిఖండికి దెఱపిచూపెను. అతండు భీష్ముని యురమున వాలుటమ్ములం గురిసెను. కాని భీష్ముండు వానిని వానచినుకులట్లు నిర్లక్ష్యించి నిలువబడెను. దుశ్శాసనుం డాతనికడ్డము వచ్చెను. కాని యర్జును డాతని నిశితాస్త్రంబుల నొప్పించిమరల్చెను. ఇంతలోం గురుబలంబులు ప్రవాహముగా వచ్చిరి. కాని యర్జునుండు వారల నెల్లం జీకాకుపరచి చెదరం గొట్టుచుండెను. భీష్ముండ త్తఱి పాండవుల పరాక్రమమునకు సంతసించుచుం దన ప్రతాపంబు సూపంగోరి ముందఱ సేనల మట్టాడుచుండెను. విరటుని తమ్ముండగు శతానీకుం డాతని నెదుర్కొనెను గాని యొక్కింతనే భీష్మునిచేం దల నఱుకబడెను. పాండవసేనలాతని వేండిమి కోర్వజాలక వాపోవుచుం బాఱందొడంగిరి. శ్రీకృష్ణుడదిగాంచి 'అర్జునా! ఇత్తఱి నీ వుపేక్షించిన మన పని తప్పును. కావున నీవు తీవ్రించి భీష్మునిం బొడవి గెలువుమని హెచ్చరించెను. అర్జునుం డంత నుదగ్రశౌర్యుండై యురవడించి భీష్ముని బాణపుంజంబులం గప్పెను. శిఖండియు తీవ్రశరంబుల నాతని నొప్పించెనుగాని భీష్ము డెదురేయ నొల్లకుండెను. అది సందుగా సవ్యసాచి భీష్ము చాపముం దునిమి శితశరవర్షంబుల నాతనిపైం గురియుచుండెను.

కాని కౌరవవీరు లద్దాని సహింపక కొండ వలె నడ్డుపడిరి. పాండవ యోధాగ్రణులు నా రంగంబున నావిర్భవించి యత్యుగ్రంబుగా వారిం దలపడి పోరు సాగించుచుండిరి. అర్జునుఁడు కురుసైన్యంబున నెల్లెడఁ దానయ్యె, మారి మసంగినట్లు వారిని మూఁపుమాపి, భీష్మునిం జెనకి, శిఖండిం బురికొల్పుచు నాతనిచే నిశిత సాయకంబులు సేయింపుచుఁ దానును వివిధశస్త్రాలం బఱపుచు భీష్ముని విల్లంబుల దునిమి, సూతుని కేతనంబును గూల్చెను. భీష్ము డర్జును ప్రతాపముం దలంచి 'వీరికి శ్రీకృష్ణుండు ప్రాపు గాకున్న నేనొక్కండనే ధనుర్మాత్ర సాహాయ్యుండనై గెలువనా?' యని యెంచి మరల సంభ్రమము నణంచుకొని "వీరలు శ్రీకృష్ణునితో వచ్చి నన్నుఁ గోరఁగా నావధోపాయం బెఱింగించితిఁగదా? నాకీ సమర సంభ్రమ మేల? శాంతినై మరణంబునకు వేచియుండెద నని వినిశ్చయుఁడయ్యెను.

అట్లు నిశ్చయించుకొనియుఁ దా నూరకుండుట భావ్యముగా దని భీష్ముండు వేరొండు విల్లెత్తి యర్జునునిపై బాణంబు ప్రయోగింపఁ దొడఁగెను. శిఖండియు నుద్ధతోత్సాహంబున భీష్ముని నొప్పించుచుండెను. గాని యూరకుండుటచే నర్జునుఁడు భీష్ముని విల్లునుద్రుంచి గాఢముగా నొవ్వనేయుచుండెను. ఆతరుణమున భీభత్సుఁడు పొంగిన వారాశియుం బోలె నెవ్వరికిని వారించుటకు గాదు చేరుటకైన భీభత్సముగ నుండి బిరుదాహ్వయ మన్వర్థము చేయుచుండెను. అప్పుడు భీష్ముండు నివ్వెఱపడి చూచుచున్న దుర్యోధనునితో నిట్లనియె.

"మ. అని దేవాసురకోటికైనను నశక్యంబిమ్మహావీరు మా
రొక్కన, వీఁడల్గిన మర్త్యులేయెదురు వీరుండైన యీ క్రీడి ద
క్కనివ్వాండవసైన్యమింతయు మగ్గింపంగ నేఁ జాలుదున్
విను సత్యంబిది, వీనివంటి కెదురన్ విల్లెత్తలేఁడెవ్వడున్."

'దేవాసురులైన నీయర్జును నెదిరిపోరఁజాలరన్న నిఁక మర్త్యుల మాటయేల? ఈవిన్యాచ్చుం గక్క తక్కిన పాండవుల నెల్ల నే నొక్కడనే చక్కడంచఁగలను. కాని యీ వీరునిపై నెవ్వఁడును విల్లెత్తఁజాలఁడు. ఇట్లనుచుండ నర్జునుఁడు శిఖండి విల్లువెనుక తన విల్లునిలిపి యాతఁ డేసినట్లుగఁ గొన్ని వేఁడియలుగులఁ బరపిన భీష్ముండు నొచ్చి చెంతనున్న దుశ్శాసనునితో 'ఓయీ! యీబాణములు శిఖండివి కావు. ఇవి కర్కటి గర్భమువలె నాయంతమును గనునట్లున్నవి. ఈతని బాణములకింత శక్తియు, శుద్ధియు, లక్ష్యమును, దీప్తియుఁ గలుగ నేర్చునే; ఇయ్యవి తప్పక యర్జును విశిఖంబులు గావలయు,' నని పలికి యాతనిపై నొక్కపటుశక్తిం బరపెను. పార్థుఁడు వానిం దునుమాడి భీష్మునిపై తీవ్రశరపరంపరఁ గురియఁదొడఁగెను. మఱియు నాతని ప్రేరణంబున పాండవబలంబులు 'భీష్ముని నేయుఁడు పొడువుఁడు పొడువుఁ'డని యఱచుచు నుద్రేకంబున ముత్తంబులుగా వయింగవియుచుండిరి. కౌరవు లావృద్ధవీరుని రక్షించుటకై తండోపతండంబులుగా నడ్డుపడిరి అప్పుడు పోరు భయంకరమయ్యె. ఎల్లరి మనసులును భీష్మునిమీఁదనే వ్రాలెను. సురలోకము నుండి యాత్రముతో భీష్మునే కనుచుండిరి. సూర్యుఁడు శాంతించుచుండెను. అట్టియెడ నర్జునుఁడు వింట దీప్తివిశిఖంబులఁ దొడగి భీష్ముని మేన నింపెను. ఆవృద్ధవీరుఁడు వాని తైక్ష్ణ్యమున కోర్వఁజాలక కౌరవులు వెఱఁగుపడి చూచుచుండ, సురలు రిచ్చపడ, నేల కంపింప, నహర్పతి యస్తాద్రి గ్రుంకునట్లు తూర్పు దెసగా నరదమునుండి యొరఁగెను. అమ్మహానుభావుని నెమ్మేను పుడమి నంటకుండ శరము లూఁత యయ్యెను. ఇయ్యది యెంతయు వీరోచితముగదా! యుద్ధ మారంభముగా దశదివసంబు లవక్ర పరాక్రమంబునఁ బోరి శాత్రవ చమూ సంహారం బొనర్చి దుర్దేయుఁడనిపించుకొన్న భీష్ముఁ డిఁక రణరంగమునుండి విశ్రమించెను. పాండవులును

వారి సేనలును దమ విజయంబున కపరిమితానందభరితులై శంఖంబులు పూరించిరి. దుర్యోధనాదికౌరవులు మహారథ శ్రేష్ఠుండగు తమ సర్వసేనానాయకునిం గోల్పోయినందులకు నిష్ప్రతీకారదుఃఖాక్రాంతులై యెలుగెత్తి యాక్రందన మొనర్చుచుఁ గన్నుల నీరు నించుచు, గాలు సేతు లాడక పాండవుల దిక్కు సూచుచుండిరి. ఈభయానకదృశ్యము దిలకింపఁ జాలక సవితృండపరవారిధి నస్తమించెను.

---

# ఏ కా ద శా ధ్యా య ము

## శరతల్ప శయనము ౧

భీష్మపతనముతో నాఁటి రణము ముగిసెను. తోడనే కౌరవులును పాండవులును శస్త్రాస్త్రంబులు విడిచి, మైమఱువు లూడ్చి బంధుమిత్ర సహితంబుగాఁ బితామహు పాలికిం జనిరి. ధనంజయుం డొక్కఁడును ధనుష్పాణియై యరిగెను. ఇట్లయ్యిరుపక్షంబులు రోషంబు లుడిగి ప్రశాంతులై తన్నుంబరివేష్టించినందులకు భీష్ముం డెంతయు హర్షము నొంది వారి నభినందించి వారిచే వలయు పరిచర్యలఁ జేయించుకొనుచుండెను. ఆ వృద్ధవీరుఁడు తనకుఁ "గ్రిందల" యని చెప్పఁగా దుర్యోధనుఁడు మెత్తని తలగడలు దేఁబనిచెను. భీష్ముం డదికని చిఱునవ్వుతో సవ్యసాచినిఁ బిలువ నాతఁడు గాండీవము నేలపైఁబెట్టి బాప్పంబులు విడుచుచు డగ్గఱెను. భీష్ముఁ డతనితో దన సెజ్జకు సర్వాముగాఁ దూపులతోఁ దలగడ పెట్టుమని యానతిచ్చెను. అర్జునుం డట్లేయని గాండీవముఁ గైకొని తాత యనుమతి నొంది మూఁడు

వాలుటమ్ముల నభిమంత్రించి పెడతలయెత్తి పట్టుకొని పుంఖంబులు భూమిపై మోచి నిలుచునట్లుగా నేసెను. భీష్ముఁ డందులకు బ్రీతుండై తల్పంబునకుఁ దగిన యుపధానము సమరించితివని కొనియాడెను. పిమ్మట నచ్చట వారల నెల్ల గలయంగని యుత్తరాయణపుణ్యవేళకై నే నీయెడఁ బడియుండి సూర్యునారాధింపుచు దినములు గడుపుదును. నన్ను దృఢముగా రక్షించుచుండుఁడు. నన్ను గావఁగోరినచో పరిఖతోడి ప్రాకారంబును నిర్మింపుఁడని యానతిచ్చినఁ గౌరవులును పాండవులును నీయాజ్ఞ తలఁదాల్తుమని చెప్పి యవ్విధంబున నాచరింపఁ దమతమ వారలలో నర్హుల నియమించిరి; అంత చికిత్సకులు వచ్చి శల్యచికిత్స సేయుదుమని విన్నవించిన భీష్ముఁడు వారిని వారించి, బహూకరించి, యభిమతార్థంబులిచ్చి పంపెను. అంత గీత వాద్య నృత్తంబులఁ బ్రవీణులగు వారు వచ్చి యాయనకు వినోదంబు సేయుచుండిరి. అట్టి యెడ నావీరుండు నిస్సారంబున దప్పిక వాడమి నీ రడిగెను. అందఱు నన్నికడల ప్రశస్తపానీయంబులఁ గొని తెచ్చిరి. కాని భీష్ముఁడు వానిం బరిగ్రహింపక శరతల్పగతుండనగు నేను దీప్త విశిఖాగ్రంబుల భూగర్భమును బ్రచ్చి తీసిన జలంబె కాని యన్యసలిలంబుల నొల్ల' ననియెను. ఈ మాటకు కౌరవులును దక్కిన రాజులును వెఱఁగుపడి చూచుచుండిరి. గాంగేయుఁ డంత నర్జును నవలోకించి 'అర్జునా! శరవేదన నొడలంతయు దపించుచున్నది. పెదవు లెండుచున్నవి. కావున వేగమే నాదప్పిక తీర్పగల జలంబు నొసంగు' మని యాజ్ఞాపించెను అర్జునుఁడు తోడనే యామహావీరునకు ప్రదక్షిణంబొనర్చి తేజోమయంబైన బాణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబు గావించి మహీతలంబును గాఢ నేసిన దివ్యసుగంధ సలిలంబులు ధారారూపంబున భూగర్భమునుండి యెగసెను. కౌరవు లది గని విస్మయకంపంబులం బొందిరి. అర్జునుఁ డాతోయం

బుల భీష్మునకుఁ బ్రావనిచ్చి పరితృప్తుం జేసెను. అంత నావృద్ధపితామహుండు గాండీవిం గాంచి "ఓయీ! నీవును గోవిందుఁడును గూడిన నసాధ్యంబులు లేవు మీతో వైరము మానుమని కురురాజున కనేక భంగులఁ దెలిపితిని. కాని యాతఁడు వినఁడయ్యె. తత్ఫల మిఁక భీముని చేత ననుభవించు"నని వచియించెను. పిదప సుయోధనుం బిలిచి,

"మ. నరుఁ డత్యద్భుత విక్రముం, డతని కానారాయణుం డాప్తుఁ, డె
వ్వారికిన్ వీరి జయింపరాదు, సము దావష్టంభముం దక్కి ధ
ర్మరతుండైన యజాతశత్రునకు నింద్రప్రస్థ మిమ్మర్ధరా
జ్యరమం బొందుము, మీరు కొంద అయినం జాలున్న నీ కొప్పదే?"

"ఓయీ! అర్జునుం డద్భుతవిక్రముఁడు. కృష్ణుఁ డాతనికిఁ బరమాప్తుఁడు. ఈ యిరువురను జయించుట కెవ్వరికిని శక్యము గాదు. నీవు యుద్ధము మాని ధర్మజున కింద్రప్రస్థ మొసంగి యర్ధరాజ్యమును హాయిగా ననుభవింపుము. [ఇదియే కురుపాండవ విభాగమును గురించిన భీష్ముని నిశ్చితాభిప్రాయము.] మీలోఁ గొందఱైనఁ జావకుండుట నీకు మేలుకాదే?" యని హితము బోధించెను; కాని కౌరవ పాండవు లెవ్వరును మాటాడక యాతనికి నమస్కరించి నిజనివాసంబుల కరిగిరి.

పిమ్మట నమ్మహాత్ముని సన్నిధికి కర్ణుఁ డొంటరిగా వచ్చి భక్తి వినయంబు లెసఁగఁ బాదప్రణామంబు లాచరించి 'మహాత్మా! మున్ను నిన్నెన్ని యోమాఱు లజ్ఞానంబున ధిక్కరించి యపరాధముఁ గావించితిని. నాపై నలుక మాని నీ వాత్సల్య శీతల కటాక్షంబులు బరపు' మని వేఁడికొనగా భీష్ముం డాతని నధికాదరంబునఁ జేరం బిలిచి 'ఓయీ! నీదెసఁ గోపమేల? నీవు కులభేదము సేయుటను, బిడ్డలఁ జెఱుచుటను జూచి సహింపలేక పలుమారు నిన్నుఁ గినిసి నిష్ఠురోక్తుల నిందించితిని. ఇయ్యది శిక్షకాని రోషముగాదు' అని యనునయించుచుఁ బలికెను.

ఆహా! 'శిక్షకాని రోషముకాదు!' దీర్ఘరోషద్వేష దగ్ధులగు మన మీ వాక్యార్థము నెట్లు సంపూర్ణముగా గ్రహింపఁగలము? ఇట్టియుదారస్వభావమే కదా యాత్మోన్నతికి ప్రధాన లక్షణము!

మఱియుఁ భీష్ముఁ డిట్లనెను. 'వీరశేఖరా! నీవు దైవ వరంబున జనియించితివి. నీవు కౌంతేయుఁడవు కాని రాధేయుఁడవుకావని వేదవ్యాసుఁడు రహస్యంబున నా కెఱింగించె. అట్లగుటచే నీయెడ నాకు వాత్సల్యమేకాని మాత్సర్యము లేదు. నే నొక్కపని చెప్పెద వినుము. నీకు శుభంబగును. పాండవులు ధర్మపక్షులగుటను శ్రీకృష్ణుఁడు వారికి దోడగుటను వా రజేయులని యెఱుంగుదువు. నీకు వారితోడి విరోధం బొప్పదు. నీవుఁ పాండవేయుఁడవే. కావున వారిం గూడియుండుట లెస్స' కర్ణుఁ డీ హితవచనంబులు విని 'దేవా! నేను కౌంతేయుఁడ నని యెఱుంగుదును. పాండవులకు శ్రీకృష్ణుండు ప్రాపు గలఁడనియు, వారిని రణమున గెల్వఁజాల ననియు నెఱుంగుదును. అయినను కురురాజు నాకుఁ జేయుమన్నన లెల్లఁ దలంచి చూచిన నే నాతని వీడిపోవుట వీరలక్షణము గాదని తోఁచెడిని. మఱియు పాండవులను బలుమారులు పరాభవించి, వైరముం బెంచి సమయము వచ్చినప్పుడు రారాజును వీడుట పాడి గాదని తలంతు. ఇంతకును దైవేచ్ఛ యిట్లుండఁగా మన మేమి చేయఁగలము? నీవు దయయుంచి నన్నొండు పల్కక పరసేనలపైఁ బంపుము. నాసేవాధర్మము నిర్వహించి నా వీర్యాతిశయముం బ్రకటించి కృష్ణార్జునుల గర్వం బుడిపెద' నని సవినయంబుగాఁ బ్రార్థించెను. భీష్ముఁ డందులకు 'వత్సా! నీ వంతటివాఁడ వని యెఱుంగుదును. సుయోధనుని చిత్త మెట్లో యట్లే వర్తింపుము. ఆతని యాశలకెల్ల నీవే కదా యాలవాలము! నీ కనుజ్ఞ యిచ్చితిని.

మఱియొక యనుమాన ముడిగి సంతసంబున నందు'మని సెలవిచ్చెను. కర్ణుం డా పితామహుని బంధుభావమునకుఁ బరమానందము నొందుచు నిజనివాసంబున కరిగెను.

---

## ద్వా ద శా ధ్యా య ము



### శరతల్ప శయనము — ౨

భీష్ముండు వడిన పిదప ధర్మరాజు క్రమముగా ద్రోణ, కర్ణ, శల్యాది మహావీరులను సంగరంబునఁ బొలియించి, ధార్తరాష్ట్రుల నూపుమాపి, విజయలక్ష్మిం జేపట్టి కురుసామ్రాజ్యాభిషిక్తుండై యొక్కనాఁడు శ్రీకృష్ణుని దర్శింపబోవ నా మహాత్ముఁడు ధ్యాననిమగ్నుండై యుండెను. ధర్మజుం డాతని బ్రసన్నుం జేసికొని 'మహాత్మా! యీధ్యానం' బేమని ప్రశ్నింప నాతఁడు లేఁతనవ్వు నవ్వి యిట్లనెను.

"సీ. గంగ యెవ్వానిఁదన గర్భంబునం దతి
శ్లాఘాసమేతయై సంభరించె?
భార్గవుం డెవ్వానిఁ బరమ శిష్యుఁడు గాఁగఁ
బడసి గురుత్వ మెక్కుడుగ నెగడె?
నా రాముఁ డెవ్వనితో రాసి యిరువది
మూఁడు దినములకు వాఁడి దొఱఁగె?
కాశీశు కన్యలు గారణంబుగఁ బోరి
యెవ్వని కోడి రనేక నృపులు?

గీ. వేదములు నాలుగును ధనుర్వేదమును మ
హాస్త్రములుఁ జెంది యెవ్వనియందు వెలిఁగె?
నట్టి భీష్ముఁడు నన్నిప్పు డాత్మఁ గలఁచు
చునికిఁ ద ద్గతమయ్యె నామనము నధిప!"

'రాజా! మహామహిముఁడగు భీష్ముండు నన్నిప్పుడు భక్తితో ధ్యానించుచుండుటచే నాహృదయ మాతనియందు లగ్నమైనది. వసిష్ఠ శిష్యుఁడు, త్రికాలవేది, సర్వవిద్యావలంబనుఁడు నగు నమ్మహాను భావుం డస్తమించిన ధాత్రియంతయుఁ జంద్రుఁ డస్తమించిన రాత్రియగును. సకలజ్ఞానంబులు ననాశ్రయంబులై కొఱతవడును. కావున నీవాతని పాలికింబోయి నీవనుగఁదలంచిన యఖిల ధర్మంబుల నడిగి తెలిసికొనఁగము. అనవుఁడు ధర్మరాజు శాంతనవుం డట్టి మహానుభావుండని మునిముఖ్య బుధులు చెప్పఁగాఁ బల్మరు వింటిని. నిన్నుంగూడి భక్తితో నాయనను సందర్శించుటకుఁ గుతూహల ముకలదు. అమ్మహాత్ముండును నీ సన్నిధిచే సంతృప్తుండగును. కావున తోడనే యాయనం జూడఁ బోవుద' మని విన్నవించెను. శ్రీకృష్ణుం డందుల కంగీకరించి తనచే రాయితను నేయు నియమించి పాండవులను, కృప, సాత్యకి, సంజయ, విదుర ప్రముఖులను గూడు కొని యరదంబులపై భీష్ముని పాలికిం బయన మయ్యెను. ఇట్లు బయలుదేఱి కురుక్షేత్రంబున నోఘవతీ తీరంబున సాత్యవతేయాది ముని సేవితుండై నారాయణ ధ్యానపరాయణుండై యున్న భీష్ముని చక్కటికిం జని వారెల్లరు నరదంబులు డిగ్గి మునులకు నమస్కరించి భీష్మునింగాంచి భక్తిప్రేమబహుమానంబు లాచరించిరి. అంత శ్రీకృష్ణుఁ డమ్మహానీయు నవలోకించి 'మహాత్మా! నీచిత్తమెప్పటి యట్లు వ్యాకులముగా నున్నదే? శరీరపీడ మనఃపీడకంటె నెక్కుడందురు. ఒక్క ములికి గ్రుచ్చుకొన్నంతనే మిక్కిలి బాధకలుగును.

ఇట్టివేదన నొందుచుండియు నీవు దుఃఖమొందకుండుట పితృవర ప్రభావమువలనఁ గదా! నీవు కలిమిలేములను సుఖదుఃఖములను గూడ సమముగాఁ జూడవలెనని సురలకుఁ గూడ బోధింతువు. అట్టి నీ కితరులు హితవుగఁ బలుకనేల?

"ఉ. రాజవె! రాజసుందరుఁడవె! రాజితసుందరమూర్తియట్టె! వి
విభ్రాజిత సంపదున్నతి విభాసిత వర్తనుఁడట్టె! కామినీ
రాజి మనోజ్ఞ భంగి చతురత్వ ధనుండవె! బ్రహ్మచర్య దీ
క్షాజిత మన్మథుండు నవె! జన్మము లిట్టివి యెందుఁ గల్గునే?

క. సురలును నసురులు యక్షులు
నరగులు గంధర్వులును మహోద్ధతిఁ బైపై
నురవడి వచ్చిన నొకఁడవ
పరాజితులఁ జేయు దుగ్రబాహాస్ఫురణన్.

చ. దమమును సత్యమును తపముదానము వేదములందుఁ జావవే
వేగమునఁ గల్గు నైపుణియు ధర్మవిధిజ్ఞతయుక్త విరోధి భూ
రమణ విమర్దన క్రమ విరాజిత శౌర్యము నీకుఁ బోలె నై
జముగఁ గువాఁడు వేఱొకఁడు శంతనునందనపుట్టఁడెన్నఁడున్.

క. వేయేల సంభవించునె?
సాయకతల్పమునుండి 'చావఁగ నొల్లన్
నా యిచ్ఛగాక' యను నరుఁ
డే యుగమునఁ జూడ వినఁగ నెచ్చటనైనన్.

తే. వసువులందును బెద్దవు, వాసవాది
సురుల మిగులుదు గుణముల, ధరణిసురులు
సెప్ప విందు నీమహిమ నాచిత్తమునను
గందు ననుపమ తేజ! గంగాత్మజాత!"

"ఆహా! రాజవై, రాజసుందరుఁడవై, సకలకలావిరాజివై నెగ

డియు, జితేంద్రియుండ వైన నీ జన్మ మసదృశము. కురువీరా! సురా సుర యక్ష గంధర్వాదు లొక్కుమ్మడి నెత్తివచ్చినను పరాజితులఁ జేయఁగల నీ పరాక్రమము వర్ణనీయము. సత్య శమ దమాది సద్గుణములును, సమస్త విద్యా పాటవమును, ధర్మసూక్ష్మ జ్ఞానమును, శత్రుభయంకర శౌర్యమును—ఇన్నియు నీ యొక్కనియందుఁ గాక నుఱియెందు నిరవుకొని యున్నవి? ఇన్ని యేల? శరతల్పమున నుండి 'నా యభిమానము కాదు కావున నే నిప్పుడు మరణింప' నని నీ వలె నెవ్వఁడనఁగలఁడు? ఇట్టి వైచిత్ర్య మేయుగమున నైన జరిగియుండుట వింటిమే? ధన్యాత్మా! నీవు వసువులలోఁ బెద్దవనియు, దేవేంద్రాదులును నీకు గుణములలోఁ జాల రనియు బుధులచేఁ బలు మరు విని నీ మహిమ నెప్పుడును నా చిత్తమున నూహించు చుందును." అని పలికి 'పాండవాగ్రజుం జూపి 'యీ ధర్మతనయుఁడు బంధుమిత్ర వియోగముచే శోకోపహతుఁడై యున్నాఁడు. నీవు సమస్త ధర్మపారంగతుఁడవు. నీ వరిగిన వో నీలోకంబున జ్ఞానము పొనుంగువడును. వీరెల్లరు నీ ధర్మంబులు వినఁ గుతూహలులై యున్నారు. కావున నను గ్రహించి యీతని నీ పుణ్యవాక్యములచే ప్రబుద్ధమానసునిగ నొనర్పు' మని కోరెను. ఈ వాక్యములకు భీష్మాచార్యుఁడు మొగం బించుక యెత్తి కృతాంజలియై శ్రీకృష్ణునిం బ్రశంసించి 'దేవా! సమస్త జ్ఞానములు నీయం దిమిడియున్నవి. నీ వాగ్విలాసము ముందఱ నాబోధ లెంత? విషానల సదృశంబులగు శరంబులు బెట్టు వేదనచే నంగంబులును, నంతరంగంబును నవశంబై యున్నవి. ప్రతివచించుటకు శక్తి లేదు దౌర్బల్యముచే కంఠమును నాలుకయు స్వాధీనము తప్పినవి. నాయెడఁ బ్రసన్నుండవై ధర్మపుత్రున కెయ్యది హితమో యరసి నీవే బోధింపుము. నీ వుండ నేను జెప్పుట గురుండుండ శిష్యుండు చెప్పుట గాదే?' యని సవినయంబుగాఁ బలికెను. శ్రీకృష్ణు డది విని

ప్రసన్నుండై 'కురువీరా! నిన్ను శరవేదన బాధింపకుండను, క్షుత్పి పాసలు చేరకుండను, దివ్యజ్ఞానము పొందునట్లును వరము లొసంగితిని. నా ప్రభావంబున నీకిట్టిశక్తులు గలుగు' నని వచియింప, భీష్ముండమం దానందము నొంది యాయన దాక్షిణ్యముల గొండాడి ధర్మజునకు ధర్మరహస్యంబు లెఱింగింప నంగీకరించెను. అంత వారెల్లరు సంతోషం బునం దమ తమ నిలయంబుల కరిగిరి. మఱునాటినుండియు భీష్ముండు రహస్యంబున మునిప్రవరులును పాండవ యాదవముఖ్యులును, ధృతరా ష్ట్రుండును, సంజయవిదురులును దన్నుం గొలుచుచుండ ధర్మనందను మనస్సంశయంబుల నెల్లం దన బోధామృతంబునం దొలంగించుచుం డెను. ఇట్లూరుదినము లుపన్యసించి భీష్ముండు తా నెఱింగింపవలసినది యెల్ల నెఱింగించితి ననియు, నిఁక ధర్మోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయు మనియు ధర్మపుత్రున కాజ్ఞాపించి, యుత్తరాయణము ప్రవేసిం చినతోడనే తాను శరీరము దొఱగుట నెఱింగించి, యప్పటికిఁ గనకడ కరుగుడెమ్మని వారలనెల్ల సెలవిచ్చి పంపెను. ఆ మహాయోగీశ్వ రుండును సూర్యుం డుత్తరాభి ముఖుండగువరకు నేఁబది దినసంబు లేకాంతమున పరమేశ్వర ధ్యానము తోడను, వ్యాస పరాశరాది మహర్షి గోష్ఠియందును పుణ్యోత్కృష్టంబుగాఁ గాలంబు గడపుచు నిర్యాణముహూర్తంబును వేచియుండెను.

---

## త్ర యో ద శా ధ్యా య ము

---

### ని ర్యా ణ ము

పూజ్యుఁడగు సూర్యభగవానుం డుత్తర దిశోన్ముఖుండయ్యెను. భీష్మాచార్యుండును సాయుజ్య సమయమునకై సర్వసంసిద్ధుఁడై ప్రమోది

తాంతరంగంబున పరమేశ్వర ధ్యాన సంకలితుండై యుండెను. అట్టి యెడ ధర్మరాజు ధృతరాష్ట్రుని, కుంతిని ముందిడుకొని శ్రీకృష్ణ సాత్యకులను, తనసోదరులను, విదుర సంజయాదులను, కృపాచార్య ధౌమ్యలను, మంత్రకోవిదులను, యాజకులను దోడుకొని, వస్త్ర చందనాగరు ఫలపుష్పములను, పూర్ణకుండములను గ్రహించికొని యనేక రత్నములను గాంచనములను గైకొని సమస్త పరివారముతో మహావైభవంబున భీష్మాచార్యుని వీరశయనస్థలంబునకుం జని దొరచి యరదంబు డిగ్గి, పితామహునుం జేరంజని 'మహాత్మా! ధర్మనందనుఁడ నిదె ప్రణమిల్లుచున్నాఁడను. నాపలుకు నవధరింపుము. నీ యానతి చొప్పున నీ తనయుఁడు ధృతరాష్ట్రుఁడును, శ్రీకృష్ణుఁడును, సమస్త బంధుజనులును, విప్రులును, పౌరులును, నెల్లరు నేతెంచిరి. కన్నువిప్పి రిం జూడు' మని కన్నుల నీరునించుచు గద్గదముతో విన్నవింపన మ్మహాత్ముఁ డంతట నాలోకించి, ధర్మతనయుని కరముఁ గీలించి 'వత్సా! మేలుచేసితివి. నీవు గెలుగుట దైవయోగముగా నెంచెదను. ఇది మాఘమాసము, శుక్లపక్షము, నేకాదశియు నగుట నామనంబుప్పొంగుచున్న' దనియెను. పిమ్మట ధృతరాష్ట్రుం దిలకించి 'కుమారా! నీవు సర్వవిద్యలు నేర్చితివి; సమస్త ధర్మములు నెఱుంగుదువు. నీ వన్ని విధముల ధన్యుఁడవు. భవితవ్యమునకై విచారింపక ధర్మవర్తనుఁడగు నీ ధర్మనందనునిచే శుశ్రూషలం బడయుచు నాతనిపై దయగలిగి యుండుము. ఇతనికి నీయెడ నధిక భక్త్యనురాగములు గలవని నేనెఱుంగుదును. కుమారా! దుర్యోధనాదు లవినీతులు, అధర్ములు, క్రోధనులు, లుబ్ధులు నగుటచే స్వకీయ దుష్కృతంబులచే నడసిరి. వారికై నీవు విచారింపకు, మని యుపదేశించెను. అవల శ్రీకృష్ణు నాలోకించి,

"గీ. దేవ దేవ! దేవాత్మక! దేవవంద్య!
శంఖ చక్ర గదా పద్మ చారుహస్త!
వాసుదేవ! త్రివిక్రమ! వరద! పరమ
పురుష! ప్రణతి యొనర్చెదఁ గరుణఁ జూడు!"

అని స్తుతియించి,

"ఆ. బలము నీవ నాకు, భక్తుండ నీయెడ,
నాలు బిడ్డ లేనియట్టివాఁడఁ
గావు నన్ను నధిక కారుణ్యమున, నిమ్ము
నుజ్ఞ కమలదళ మనోజ్ఞ నయన!"

'కృష్ణా! నీవేనాకు బలము, నేను నీ భక్తుఁడను; ఆ బిడ్డ ం లేనివాఁడను, నాయందు మిగులఁ గరుణించి కాపాడుము. నాకిక సెలవు దయచేయు, మని దైన్యంబుగా వేఁడికొని "కృష్ణా! పాండు పుత్రులకు నీవేగతి. కృష్ణుఁ డెక్కడ నున్న జయ మక్కడను ను నని నేను దుర్యోధనునకుఁ బలుమరు బోధించినను వినక, యా బుద్ధి పలువురఁ జంపించి తానజచ్చెను. నీ మహాత్మ్యము మొదటిన య నే నెఱుంగుదును గాదే!" యని విన్నవించెను. శ్రీకృష్ణ డ న నా వృద్ధవీరు నత్యాదరంబున నవలోకించి,

"ఆ. కీడొకప్డు లేదు; కృత పుణ్యుడవు; తండ్రి
వలని భక్తి పెంపు గలవు; దానఁ
గాదె బంటుఁబోలె గాంగేయ! మృత్యువు
నీ వశమున నిలిచె నిర్భరముగ."

'నీవు పరుల కెన్నఁడును గీడును దలంచి య డ లేదు. పుణ్యాత్ముఁడవు. నీ పితృభక్తి మహత్వము వలన మ్మ త్యు నీ బంటయి నిలిచియున్నది. నీ వన్నివిధముల ధన్యుఁడవు. నీ న నే ననుజ్ఞ యిచ్చితిని. దేవత్వముఁ బొందు' మని ప్రియంబునఁ బ కెను.

అంత భీష్ముఁడు ధృతరాష్ట్రాదు లందఱ యనుమతి యడిగి, వారల నెల్ల బ్రియంబునఁ గౌఁగిలించుకొని, దయాసత్య శౌచంబులు నిత్యంబులుగాఁ బాటించి బ్రదుకుండని చెప్పి, తాను తొల్లి రాజుల గెల్చి తెచ్చిన ధనంబులు విప్రజనంబుల కిచ్చి, ధర్మతనయుం జూచి గురుజనులును విప్రులును బూజనీయులని చెప్పి యూరకుండెను. పిమ్మట నమ్మహానుభావుఁడు ధారణానుక్రమంబున సమాహితాత్ముండై వాయువుల నిరోధింప నవి యూర్ధ్వగతిం గైకొని యెను. అమ్మహాత్ముం డవయవంబులఁ బ్రాణంబులు దిగిచికొని వచ్చినప్పు డయ్యె యంగంబులు శల్యరహితంబు లయ్యెను. అది గాంచి శ్రీకృష్ణాదు లగు నఖిలజనంబులు నాశ్చర్యభరితాంతఃకరణు లగుచుఁ గీర్తించిరి. ఆ సంయమివరుఁడు సర్వేంద్రియంబుల నరికట్టి నాత్మ మూర్ధంబు భేదించి మహోల్కాకారంబున నాకసంబున కెగసి కొంతదవ్వరిగి యంతర్హితం బయ్యెను. ఆ యుత్కృష్టాత్మ యమరత్వముం బొంది శాంతించెను. అప్పుడు పుష్పవృష్టి కురిసెను. దేవదుందుభులు మొఱసెను. మహావీరుఁడు, మహాయోగి, మహాత్యాగి, మహాభక్తుఁడు, మహావేదియు నగు భీష్మాచార్యుం డిట్లు నిర్యాణముం బొందెను.

ఆవల ధర్మపుత్రుఁ డా శవరత్నంబునకు యథోచితముగా ఘృతచందనాదులతో నగ్నిసంస్కారం బాచరించి సమస్తభూతతర్పణంబుగాఁ బితృమేధంబు నిర్వర్తించెను.

---

# చతుర్థశాధ్యాయము

పరిశిష్టము

"సీ. అఱచేత నున్నట్టి యఖిల రాజ్యమ్ము వ
ర్జించి సత్కీర్తి నార్జించినాఁడు
అన్యాయ మొనరించు నాచార్యుఁడైనను
శిక్షించి నీతి రక్షించినాఁడు
వృద్ధత్వమున వైరి వీరాగ్రగణ్యుల
వేఁటాడి శౌర్యంబుఁ జాటినాఁడు
శరతల్పగతుఁడయి సకల ధర్మంబుఁ
గఱపుచు శాంతంబుఁ గురిసినాఁడు
గీ. బ్రహ్మచర్య గరిష్ఠుఁడై ప్రబలినాఁడు
నిన్ను నిరతంబు మదిలోన నిల్పినాఁడు
'భీష్ము, సంతటి భక్తుండు పృథ్వి నెవఁడు?
సకల కళ్యాణ గుణధన్య! సర్వమాన్య!"

[సర్వమాన్య శతకము]

శ్రీ భీష్మాచార్యుని జీవితకథ ముసిగినది. ఈ యల్ప ప్రయత్న మా మహాత్ముని శక్తిలో, భక్తిలో, త్యాగములో, ధర్మములో శతాంశము ప్రకటింపగల్గినను సంతసమే. ఇది వట్టి యతిశయోక్తులతోఁ గూడిన కట్టుకథయని కొందఱు కొట్టివేయవచ్చును. కాని యీ కల్పనల యడుగున విచిత్రకాచ పాత్రమున వినిర్మలముగ వెలుఁగు దీపశిఖవలె, నొక మహా చారిత్రకవ్యక్తి—జనకునికై బ్రహ్మచర్యముం బూనిన భీష్ముఁడు—ధర్మమునకై గురునితోఁ బెనంగిన భీష్ముఁడు—కురురాజ్యంబునకై జీవితము ధారవోసినభీష్ముఁడు—

ధర్మమునకై ప్రాణము లర్పించినభీష్ముఁడు—అసదృశపరాక్రమశాలి యగు భీష్ముఁడు వీరశయనంబున ధర్మరత్నములం బోధించిన యాచార్య భీష్ముఁడు—నిజేచ్ఛచే మేనఁ బ్రాణంబులు బంధించిన యోగీశ్వర భీష్ముఁడు—భక్తాగ్రేసరుండగు భీష్ముఁడు స్ఫుటముగా గోచరించుట లేదా? ఏమి? నానా వర్ణాలంకృతమగు మేఘమాలనుండి మార్తాండునివలె ఆయన యీ యల్లికచాటునుండి స్పష్టముగా మనతో సంభాషించుటలేదా?

శ్రీ భీష్మాచార్యుని మహిమాతిశయముం ప్రశంసించుటకు శ్రీకృష్ణుని వాక్యరత్నముల నిచ్చుటఁ దడవుటకన్న నధికము చేయఁజాలము. 'ఆహా! రాజసుందరుఁడవై, సకల కళా విరాజివై నెగడియు జితేంద్రియుండవైన నీజన్మ మసదృశము. కురువీరా; సురాసుర యక్షగంధర్వాదు లొక్కుమ్మడి నెత్తివచ్చినను పరాజితులఁ జేయఁగల నీ పరాక్రమము వర్ణనీయము. సత్య, శమ, దమాది సద్గుణములును, సమస్త విద్యాపాటవమును, ధర్మసూక్ష్మజ్ఞానమును, శత్రుభయంకర శౌర్యమును—ఇన్నియు నీయొక్కనియందు గాక మఱియెందు నిరవుకొని యున్నవి? ఇన్నియేల శరతల్పముననుండి 'నా యభిమతిము కాదు. కావున నే నిప్పుడు మరణింప' నని నివలె నెవ్వఁ డనఁగలడు? ఇట్టి వైచిత్ర్య మే యుగముననైన జరిగి యుండుట వింటిమే?......' ఈవాక్యము లన్నియు మఱియొకని పట్ల నతిశయోక్తులు కావచ్చును గాని భీష్మునియందు హుతాశనునకు తేజస్సువలె, సముద్రమునకు గభీరతవలె, హిమవంతునకు స్థైర్యమువలె సహజ—వినయోక్తు లగుచున్నవి. సేజర్, నెపోలియన్, నెల్సన్, గ్లాడ్‌స్టన్, వాషింగ్టన్ మున్నగు పాశ్చాత్యవీరులు యోధులుగనో, రాజతంత్రజ్ఞులుగనో యుభయులుగనో రాజిల్లిరి. కాని మన భారత వీరశిఖామణియగు

భీష్మునింబోలె ధర్మముతోడి పరాక్రమము, పరార్థతతోడి ప్రవర్త నము, యోగముతోడి యాచరణము, జ్ఞానముతోడిభక్తి—ఇన్ని యుదార గుణరత్నములకుఁ గుదురు కాలేదు. ఈ భీష్మభాను ని ముందఱ వారందఱును కరదీపికలు, ఖద్యోతములు మాత్రమే కాఁగలరు. ఓహో ఏమి యీ వెలుగు! కన్నులు మిఱుమిట్లు గొల్పుచున్నది!!

భారతీయేతిహాసమునందును భీష్మున కొక్కఁడే—శ్రీకృష్ణుఁడొక్కఁడే యీమహద్భేదముతో నుపమేయుఁడు కాఁగలఁడు. ఈ యిరువుర శక్తులు నొక్కటే. ఇరువుర భావములు నొక్కటే. ఇరువుర పంథలు నొక్కటే. ఇరువురును పరార్థజీవనులే కాని భీష్ముని జీవితోద్దేశ్యము సంకుచితము; కృష్ణుని జీవితోద్దేశ్యము విశాలము—నిరవధికము. భీష్ముని కర్మక్షేత్రము కురురాజ్యావరణముమాత్రమే? శ్రీకృష్ణుని కర్మరంగము సమగ్రభారతవర్షమును—ఒక్క భారతవర్షమే యసనేల? అశేషమహీమండలమును ఆయన యుద్యమ గర్భమున నిమిడియుండెను. మఱియు ననుకంపనీయమగు విభేద మేమన, శ్రీకృష్ణునకు సుఖజీవనము విధింపఁబడియుండఁగా భీష్ముఁడు మహత్తరత్యాగము లొనర్చవలసి యుండెను. శ్రీకృష్ణుఁడు ధర్మపక్షమునఁ బూని విజయ మకుటాలంకృతుఁడుకాఁగా భీష్ముఁ డధర్మపక్షము నవలంబించి వినాశనమునె వరింపవలసియుండెను. ఉభయులు నాత్మపరీక్షకు హృదయపూర్వకముగా స్వాగత మొసంగియు శ్రీకృష్ణుఁడా కష్టాగ్ని కీలల నుండి స్వర్ణావతంసమువలె ద్విగుణితచ్ఛాయతో వెలువడఁగా శ్రీభీష్మాచార్యుఁ డందు చాంపేయ కుసుమమువలె దగ్ధమై నుసియయ్యెను! ఈ తారతమ్యము పరిస్థితులచే నేర్పడినదే కాని యుభయుల వస్తుతత్త్వమును సమానమే. ఉభయులును స్వస్వరంగ

ముల సమముగనే—ప్రశంసనీయముగఁ గృతకృత్యులైరి. ఉభయులు నన్యోన్య హృదయములను, మహిమాతిశయమును, గుర్తించి యొండొరుల యెడ నపార భక్తి గౌరవంబుల కాస్పదులై యుండిరి.

ప్రాచీన భారతవర్షము తన మహాపురుషుల పట్ల నెన్నఁడును కృతఘ్నతఁ జూపియుండలేదు. కేవల ఖడ్గవీరుఁడే కాక ధర్మవీరుఁడు, భక్తాగ్రేసరుఁడు, యోగీశ్వరుఁడు నయి రాజర్షి రత్నమనందగు భీష్మున కామె యుచిత రీతిని దన భక్తి విశ్వాసములను బ్రకటించియే యున్నది. మాఘశుద్ధైకాదశి నాఁడు సమస్తభారతీయులు నాత్మీయాభివృద్ధికై భక్తిమై నుపవాసము లుండి యా మహాత్మునకు తర్పణము లొసంగుదురు. కాని నేఁ డది వట్టి యర్థవిహీనముగా నాచరింపఁబడు చున్నది. కేవల జలాంజలిచే నా కర్మవీరుని యాత్మ పరితృప్తము కానేరదు. నవీన భారతవర్ష మాయన జీవనవిధానమును భక్తితోఁ బఠియించి, శ్రద్ధతో నవలంబింప వలసియున్నది. ఆయన పవిత్ర చరిత్రధ్యానముచేఁ దన హృదయమును పావన మొనరించుకొని యాయనవలెనే ధర్మస్వధర్మములకు జీవితము సంకేత మొనర్పవలసియున్నది. ఆయన ధృతి, పరోపకారము, దీక్ష, శీలము, త్యాగము, వీర్యము, ఔదార్యము, భక్తి, ధర్మవర్తనము—ఈమహోదార గుణముల నెల్ల నాస్థతో నభ్యసింప వలసియున్నది. వేయేల? ఆమె ముక్తినిఁ బడయఁగోరునేని ఆయన యాచార్యపీఠమును మరల దృఢతరముగఁ దనహృదయమునఁ బ్రతిష్ఠాపింప వలసి యున్నది. ఇంతేకాదు. ఆమె పలువురు భీష్మాచార్యులను గ్రమ్మఱ గాంచవలసియున్నది. ఆయన జీవితమున భిన్న ధర్మముల కెట్లు పోరు గలిగినదియు, ఆయన వాని నెట్లు సమన్వయించినదియుఁ గొంతవఱకు మనము గ్రహింపయత్నించితిమి. ఆయన స్వధర్మమును నిర్వహింపుచు ధర్మమును పాలించెను.

ఆయన తనకై కాదు పరులకై జీవించెను. ఇదియే ఆయన జీవిత సారము. ఈసారమునే మనము మఱిమఱి క్రోలి జీర్ణించుకొన వలసి యున్నాము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

---

# పంచదశాధ్యాయము

## భీష్మనీతి

భీష్ముఁడాచార్యుఁడు, రాజ్యతంత్రజ్ఞుఁడు. ఆయన ఆచార్యుఁడై యాదర్శధర్మములు బోధించును. రాజనీతి విదుఁడై లౌకికధర్మము లుపదేశించును. ఆయన సమస్తవిద్యాపారంగతుఁడగుటచే నాయనకు దెలియని ధర్మసూక్ష్మములు లేవు. ఆయన ధర్మముల ప్రాశస్త్యమును గుఱించి శ్రీకృష్ణుడే యిట్లు చెప్పి యున్నాడు.

గీ. ధరణి యెందాక నుండు, సుస్థిరత నీదు
కీర్తియుందాక నక్షయస్ఫూర్తిఁ దాల్చి
నడవఁ గలయది; నీవు సెప్పెడిసువాక్య
ములును వేదతుల్యంబులై వెలయుచుండు.

ఆయన యంపశయ్య నుండి ధర్మజునకు బోధించిన విషయములు మనకు నిత్య సంస్మరణీయములై యుండుటచేఁ గొన్నిటి నీక్రిందఁ బొందించుచున్నాము.

రాజధర్మములు

క. శిలఁ ద్రెంపఁబోయి యినుమును,
జలములు గొని కాల్పఁగడఁగి చని యనలంబున్
బొలియును; రాజును విప్రుల
కలిగి చెఱుపఁబోయి తాన యనయంబుచెడున్. ౧

సీ. మేదినీపతి యతి మృదువైన, మావంతుఁ
డేనుంగు నెట్టట్ల యెక్కియాడఁ
జూచుఁ ౧ దేకువ సెడి నీచపుం బ్రజ; క్రూరుఁ
డగునేని లోకంబు ౨ బెగడుఁ గుడుచుఁ;
గాన వసంతంబు భానుని చాడ్పునఁ
దగియెడు పాటితో ధరణిప్రజల
నుచితవర్తనమున నొందించునది; యిది
రాజధర్మములకు రాజు సుమ్ము

ఆ. కౌరవేంద్ర! యవియుఁ గాక 3 దండము పరీ
క్షావిశుద్ధిపూర్వకముగ వలయుఁ;
దన తలంపు వెంటఁ దమకించి ప్రజకు నొ
వ్వగఁ జరించుటయును దగదు పతికి! ౨

క: విను, గర్భిణి ర ప్రజ బ్రదుకున
కనురూపము లైనయట్టి యాహారంబుల్
గొను గతిఁ, బతి ధరణీప్రజ
౫ మనికికిఁ దగ నడచు నది ౬ తమకి గా కెవ్వుడున్. 3

క. కడు నమ్మ యునికియును నె
క్కుడు నమ్మమియును సుశీల! కుశలతగా, దె

౧ తేకువ=భయము. ౨ బెగడు=భయము. 3 దండము=శిక్ష. ప్రజ=సంతానము. ౫ మనికి=తొందరగలవాఁడు.

య్యెడ నైనను బుద్ధిసూనిపి
తడవి కని కొనంగవలయుఁ దగవుఁ దగమియున్. ౪

క. రాజునకుఁ బ్రజ శరీరము,
రాజు ప్రజకు నాత్మ; గాన రాజుం బ్రజయున్
రాజోత్తమ! యన్యోన్యవి
రాజితులై యుండవలయు రక్షార్చనలన్. ౫

క. పరుసదనము మెయి ౧ నరి గొనఁ
జొరఁ దగ, దది పోదుగుఁ గోయు చొప్పగు; విను! పా
ల్గురియించుకొనఁ దలంచిన
నరయవలదె గోవుఁ? బ్రజయు నట్టిద యధిపా. ౬

ఆ. కోరి తోఁటవాడు కుసుమఫలంబులు
కోయునట్లు రాజు గొనఁగ వలయు
౨ నప్పనములు; నటికి ౩ యంగారములు సేయు
భంగిమైన భూమి పాడుగాదె? ౭

క. ధన మపహరించుటయు తన
కనిశముఁ బని గాఁగ బ్రదుకు నతిలుబ్ధునకున్
విను! శత్రులచే నొటకు
మును దన ప్రజచేత చేటు మూఁడు నరేంద్రా! ౮

చ. కపటము లేక వైభవము గప్పగ నొండొరుమీఁద రాజుపై
నపరిమితప్రియం బెసఁగ నల్లకయుండు ముఖంబుఁ బొందియే
నృపువిషయంబునం బ్రజవినిర్మల వృత్తతఁ బుత్రుభంగి నా
నృపునృపుఁడంద్రుగా కితరునిం దగువారెదనియ్యకొందు రే?

యుద్ధనీతి

సీ. పగవాఁడు బలములఁ బన్ని త్రోఁచినఁ దాను
సబలుఁడై యొంటిమై సంగరంబు

౧ అరి=పన్ను, ౨ అప్పనము=పన్ను. ౩ అంగారము=బొగ్గు,

గోరిన నమ్మియుఁ ౧ గొనకొని మాయలో
నర్చిన మాయలఁ ౨ బేర్చి గెలుపుఁ
గొనునది, వెన్నిచ్చినను బ్రమాదంబునఁ
బడినను ౩ కైదువు భగ్నమైన,
శరణన్న, మ్రొక్కినఁ దురగాళి యెడలిన
నోరఁతోడఁ బోరుచు నున్న, నెట్టి

ఆ. పగతునైనఁ జంపఁ దగ; దధర్మంబునఁ
జంపుకంటె ధర్మసమర కోటిఁ
జావు మేలు; రాజు శయ్యఁ జచ్చుట గొఱ
గాదు గాన నోడఁ గాదు పోర. ౧౦

క. విను! ౪ చిల్ల యిడిన యాయుధ
మును విషలిప్తమగు శస్త్రమును నెట్టి యమి
త్రునిపై నైనఁ బ్రయోగిం
చిన నరపతి నరకమున వసించు నృపాలా! * ౧౧

క. తనకుం దోడ్పడి ౫ యనినో
చ్చినవానిం గాంచి కడఁగి ౬ చేష్టింపక యు
న్న నరేంద్రుఁ బొందు పాపం
బునకుఁ గొలఁది గలదె? భరతపుంగవ? తలఁపన్. ౧౨

చ. ౭ అరివయిఁ బోయి వాని పుర ౮ మగ్గలికం జెఱుపంగ దద్ధరం
బరఁగు ప్రజం జలంబు మెయి బాధలఁ బెట్టు టధర్మ; మట్టి ని
ష్ఠురతయొనర్చు టప్పటికిఁ జూడఁగ మానఁగ రాద యేని భూ
సురగృహ దేవగేహములఁ ౯ చూఱనశక్యము మాను టొప్పగున్. ౧౩

---

౧ కొనకొని=యత్నించి. ౨ బేర్చి=హెచ్చి. ౩ కైదువు=ఆయుధము, ౪ చిల్ల=శల్యము. ౫ అని=యుద్ధము. ౬ చేష్టింపక=పనిచేయక (ఉపేక్షించి యని భావము) ౭ అరి=శత్రువు. ౮ అగ్గలిక=పూనిక. ౯ చూఱ=కొల్ల, దోపిడి. * ఆర్యుల ప్రాచీన రణధర్మమునకును ప్రస్తుత రణనీతికిఁ గల తారతమ్యము చదువరులు గ్రహించెదరుగాక,

వర్ణధర్మములు *

క. కోపంబు లేమి, సత్యా
లాపము, నిజదారపరవిలాసము, శుచితా
౧ గోపన, మద్రోహం బవ
నీపాలక ! సర్వవర్ణ నియత గుణంబుల్ ౧౪

ఆ. బ్రాహ్మణునకు దమము పరమ ధర్మంబవ
శ్యంబుఁ గృత్య మధ్యయనము; దాన
సర్వకర్మములును శాసితంబులు; వాని
నడప వలయు నిష్ఠ యెడప కతఁడు. ౧౫

ఉ. కానిపథంబునం జనక, కారుణికత్వము కల్గి శాంతిమైఁ
దా నడవంగ విప్రున కుదాత్తధనం బొడగూడెనేని ౨ సం
తానముఁ గూర్ప, నర్హులకు ధర్మనియాఢతఁ బంచి పెట్ట, దు
ర్మానవిదూరుఁడై పరఁగఁ బ్రాప్తుఁడు కౌరవవంశదీపకా. ౧౬

చ. యజనము దానధర్మమును, నధ్యయనంబును ౩ దస్యుహింసయుం
బ్రజ కనురాగ మొందిఁ బరిపాలన సేఁతయు సంగరంబునన్
విజిత విభీతమై ౪ నురవణించుటయున్ నృపధర్మముల్ గురు
ప్రజతిలకాయమాన! సమరంబు సుధర్మువు వీనిలోపలన్. ౧౭

తే. అధ్యయన దాన యజ్ఞంబు లధిప వైశ్య
నకును గృత్యముల్ శుద్ధార్జనమున ధనము,
౫ సంచితవ్యంబు పసుల రక్షించువాఁడ
తండు వానికి నిది మహాధర్మ మనఘ ! ౧౮

---

౧ గోపనము=రక్షణము. ౨ సంతానముఁగూర్పన్=సంతతిని పోషించుటకై (సంసారమును నిర్వహించుటకైయని భావము.) ౩ దస్యులు=శత్రువులు. ౪ ఉరవణించుట=త్వరపడుట. ౫ సంచితవ్యము=కూడబెట్టదగినది. * భారతకాలమునాటి వర్ణవ్యవస్థ ప్రత్యేకము చర్చనీయము,

క. ఈ మూడు వర్ణములకును
దా మంచిగఁ బనులు సేఁత ధర్మువు కురుధా
త్రీ మహిళేశ్వర! శూద్రున,
కామెయి జీవనము వాని కజుఁడు విధించెన్. ౧౯

ఆశ్రమధర్మములు

మ. గురుశుశ్రూషయు, నాగమాధ్యయనముల్, గోష్ఠీనిరాసంబుద
త్వరతన్ మేల్ ౧ దోడయుంగఁదా జోరమియున్, భైక్షాశనత్వంబుస
ద్వరకర్మంబులయందు రాగభరగాఢద్వేషముల్ లేక యె
వ్వరితోఁ డంబగ గాక యునికియును భవ్యబ్రహ్మచర్యోక్తముల్.

మ. నిజదారైకపరత్వమున్ గరుణయున్ నిక్కంబు సున్, దాల్మియున్
సుజనాసంగము, దేవపిత్రతిథిసంశుద్ధార్చనల్, ౨ హవ్యభు
గ్భజనంబుల్, సకలాశ్రమస్థులకు శక్యప్రక్రియం బ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె నుర్వీశ్వరా!

శా. తానుం భార్యయు నేఁగు ౩ బేరడవికిం, దానొక్కఁడై సం జనుల్
మానాహంకృతులూడ్చు, నింద్రియములన్ మర్దించు, నచ్చో జడల్
పూనుం దాపసశాస్త్రముల్ సదువుఁ, జల్పున్ గోష్ఠి తజ్జ్ఞాళితో,
౪ వానప్రస్థ విధాప్రవిష్టుఁడు ౫ ప్రజావాత్సల్యవిఘ్నాత్మతన్.

శా. ఎచ్చోనైనను నిల్చు, నాకఁటికి నేమేనిం గొనున్, రాత్రియై
నచ్చో ౬ నెమ్మి ౭ శయించు, నగ్నిపరిచర్యం బాసి వర్తించు దా

---

౧ తోఁపయుట, దీని కిక్కడ సరియైన యర్థము తోపలేదు. ఇది ప్రమాద పతితమై యుండుననియు, "తోఁపరంగ" నని యుండవలయునని (తోడరుట—తొట్రుపడుట, శరీరకష్టము గలుగునట్లుగా దేనియందును చొరబారకుండుట యని భావము) కొందరు పండితులు చెప్పుచున్నారు. ౨ హవ్యభుగ్భజనము=అగ్నిసేవ (హోమము) ౩ పేరడవి=పెద్దయడవి. ౪ వాన...ప్రవిష్టుఁడు=వానప్రస్థవిధానమున ప్రవేశించిన వాఁడు. ౫ ప్రజా.. విఘ్నాత్ముఁడు=బిడ్డలయెడ ప్రేమలేని హృదయము గలవాఁడు. ౬ నెమ్మి=సంతోషము. ౭ శయించు=పవ్వళించు.

నిచ్చంగోరఁ ౧ డొకండు, నింద్రియజయంబేపారు భోగంబులన్
మెచ్చన్, ద్రొక్కనునొల్లకుండు ; యతిపేర్మిన్ ౨ నిర్మముండై
నృపా! ౨౩

యాగము

ఆ. ౩ అధ్వరంబుకంటె నధికంబు దపము; ద
పం బనంగ మేని ౪ ప్రన్నదనము
౫ నివురఁ జేతగా, దహింసయు సత్యవా
క్యంబు దమము దయయుఁ గాని యరయ. ౨౪

గురుజనము

సీ. విను తల్లియును దండ్రియును గురుండును సేవ
నీయులు, సద్భక్తి నిత్య నిరతి
వారలఁ గొలుచుచు, వా రెద్ది సెప్పిన
నది యాచరించుట యధిక ధర్మ
౬ మాగమ త్రియమును ౭ నగ్నిత్రయంబు ౮ లో
క త్రయంబును ౯ దేవతా త్రయంబు
నను వస్తువులు వారలందును జనని గా
రవమున నెక్కుడు రాజవర్య!
గీ. ఈ జగంబున దివమునం బూజవడయు,
మాతృభక్తుండు పితృభక్తి మానసుండు
నట్ల యవ్యయానంద ౧౦ సంప్రాపణంబు
గురు పదాబ్జ సమారాధకుఁ గడుఁ గాంచు. ౨౫

---

౧ ఒకండున్=ఒక్కటియైన. ౨ నిర్మముఁడు=మమకారము లేనివాడు. ౩ అధ్వరము=యజ్ఞము. ౪ ప్రన్నదనము=సొంపు. ౫ ఇవురజేత=ఇంకజేయుట (పోగొట్టుట) ౬ ఆగమత్రయము=ఋగ్యజుస్సామములు. ౭ అగ్నిత్రయము=గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము. ౮ లోకత్రయము=స్వర్గ, మర్త్య, పాతాళములు (సత్యవైకుంఠ కైలాసము లనియుఁ జెప్పవచ్చును.) ౯ దేవతాత్రయము=బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. ౧౦ సంప్రాపణంబు=సంప్రాప్తి.

సత్యము

తే. వాజమేధముల్ వేయొక్క వలనఁబెట్టి
యలఘు సత్యంబుఁ దక్కటివలనియందు
నిల్పి తుల దూపఁగా సత్య నిష్ఠలోని
యర్ధమున కెత్తువచ్చె న య్యధ్వరములు. ౨౬

సీ. సత్యంబు పలుకుట సర్వధర్మములకు
మిక్కిలి, యనృతంబు మేటిపాత
కము; తద్విశేషంబు గలదు చెప్పెద, నొరు
నర్థంబుఁ బ్రాణంబు నపహరింపఁ
జూచు పాతకులతో సూనృతం బాడుట
పాపంబు, బొంకులు పలికి యట్టి
వారి హింసించుట వరధర్మ, మిది యొక్కఁ
డేల ? భూతములకు హితము సేయు
గీ. బొంకు లెల్లను ధర్మముల్ ; భూత బాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము :
భూతముల దుష్ట శిష్టత్వములు వివేకి
సూక్ష్మతా వేద్యములు వానిఁ జూడవలయు. ౨౭

కర్మము

క. చనినఁ జను, నున్న నుండున్
మనుజుఁ డొకటి సేయఁ జేయు నరనాయక ! తో
డన తగిలి నీడ వోలెను
విను చేసిన కీడు మేలు విడువవు వానిన్. ౨౮

క. మొలవంబెట్టని యట్టిది
మొలచునె? తొలుమేని దానముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రయత్నం
బులు లేకయు, నింత నిజము భూపవరేణ్యా! ౨౯

క. సమయం బైనను గుసుమ ఫ
లము లెట్టులు దోఁచుఁ దరువులం, దటులే గ
ర్మములం బొడమున్ సుఖ దుః
ఖము లట్టుల నిష్ప్రయత్న కలితోద్భూతిన్. 30

పరమాత్మ

ఆ. మణిమయములుఁ గనకమయములు రజత మయ
ములు మఱియు మృణ్మయాదికములు
నైన పెక్కు పూసలందుఁ ద్రాడున్నట్లు
భూతకోటియందుఁ బురుషుఁ డుండు. 30

క. పా మెఱుఁగు బాము కాళుల,
ధీమంతుం డెఱుఁగనేర్చు ధీ సాక్షిత్వ
శ్రీమంతుఁ బరమపురుషుని
ధీమల నిర్మోచనంబు తెలుఁగు నెఱిఁగినన్. 3౨

క. కలుగుం ౧ దోఁపమి యమవస,
గలుగునె యంతటన యమృత కరునకు నాశం
బలఘు పరవస్తువునకుం
గలదె యభావంబు మనసుగానని ౨ కలుచన్. 33

ఇంద్రియనిగ్రహము

తే. ఇంద్రియంబులు దమ యిచ్చ నిట్టు నట్టుఁ
దిరిగె నేనియు దుఃఖముల్ దెచ్చు, నవియ
కట్టువడి సుఖ మొనరించుఁ, గాన నాత్మఁ
గావవలయు నింద్రియచోర గణముచలన. 3౪

కామము

క. పరిహాసము భాషణమును
నిరీక్షణము లోను గాగ నింద్యంబులు సుం

౧ తోఁపమి=ఉదయింపకుండుట. ౨ కలుచ=దోషము.

సత్యము

తే. వాజమేధముల్ వేయొక్క వలనఁబెట్టి
యలఘు సత్యంబుఁ దక్కటివలనియందు
నిల్పి తుల దూపఁగా సత్య నిష్ఠలోని
యర్ధమున కెత్తువచ్చె న య్యాధ్వరములు. ౨౬

సీ. సత్యంబు పలుకుట సర్వధర్మములకు
మిక్కిలి, యనృతంబు మేటిపాత
కము; తద్విశేషంబు గలదు చెప్పెద, నొరు
నర్ధంబుఁ బ్రాణంబు నపహరింపఁ
జూచు పాతకులతో సూనృతం బాడుట
పాపంబు, బొంకులు వలికి యట్టి
వారి హింసించుట వరధర్మ, మిది యొక్కఁ
డేల ? భూతములకు హితము సేయు

గీ. బొంకు లెల్లను ధర్మముల్ ; భూత బాధ
కంబులగు నిక్కములు పాతకములు వినుము :
భూతముల దుష్ట శిష్టత్వములు వివేకి
సూక్ష్మతా వేద్యములు వానిఁ జూడవలయు. ౨౭

కర్మము

క. చనినఁ జను, నున్న నుండున్
మనుజుఁ డొకటి సేయఁ జేయు నరనాయక ! తో
డన తగిలి నీడ వోలెను
విను చేసిన కీడు మేలు విడువవు వానిన్. ౨౮

క. మొలవంబెట్టని యట్టిది
మొలచునె? తొలుమేని దానముల నానార్థం
బులు సిద్ధించుఁ బ్రయత్నం
బులు లేకయు, నింత నిజము భూపవరేణ్యా ! ౨౯

దరులయెడ; దీని కేమని
చొరఁ దగఁ, వట్టిన మనసు సొత్తురు సుదతుల్. ౩౫

క. విను! మాంసాస్థిమయం బని
వనితాంగము సద్వివేక వైభవమునఁ గాం
చిన నందు మది దగుల దా
బనికిని ౧ నాడీ విశుద్ధి ప్రాపగుఁ బుత్రా! ౩౬

క. ఒరు లేమేమి యొనర్చిన
నరవర! యప్రియము దన మనంబున కగుఁ దా
నొరులకు నవి సేయ కునికి
౨ పరాయణము పరమ ధర్మపథములఁ గెల్లన్. ౩౭

క. జాతుఁడు మృతుఁడగుట ధ్రువము,
భూతోల్లాసము లనిత్యములు, విను, ౩ సద్యః
పాతి యగు శరీరంబున
కై ౪ తొలఁగునె ధర్మపథము నార్యుం డనఘా! ౩౮

అజ్ఞానము

గీ. అనఘ! మూఢాత్ము చిత్తంబునందు విషయ
జాల మత్యంత గాఢ సంసక్తి నొందు
లక్కరసము దండాదులఁ జిక్కఁ బట్టు
చందమున; దీనిఁ గనుట ప్రశాంతికరము. ౩౯

క. నరనాయక! [భోగాశన]
పరాయణుం డగుచు నొందు పరికింపని దు

---

౧ నాడీవిశుద్ధి=నాడులు మూఁడు, ఇడ పింగళ, సుషుమ్నలు ఇది ప్రాణాయామవిషయము. ౨ పరాయణము=ఆశ్రయము, ప్రాపు. ౩ సద్యః పాతి=అప్పుడే పడునట్టిది, అనిత్యమని భావము, ౪ తొలఁగుట=విడుచుట.

ర్నరు డెలుకఁ బిల్లి వొడివిన
౧ పరుసున, ౨ జర వొదువ ముక్తిఁ బడయక పోలియున్. ౪౦

యోగము

క. ౩ స్రోతోవేగము పటుగతి
౪ వీతబలుం ౫ దిగుచు నట్లు విషయము లీడ్చుం
జేతోబల సంభృత యో
గాతిశయుఁడు గానివాని నంచితచరితా! ౪౧

క. నదిరయము ౬ వారణేంద్రుఁడు
గుదియించిన యట్లు పోలెఁ గురువర దైన్యా
స్పద మగు విషయోల్లాసముఁ
గుదియించును యోగసిద్ధి గురు హృద్బలుఁడున్. ౪౨

దైవపౌరుషములు

క. క్షేత్రంబు పురుషకారము
ధాత్రీశ్వర! బీజ మరయ దైవము రెండుఁ
న్మాత్రపడఁగూడ నేనిం
బాత్రం బగుఁ, గర్మకరుఁడు ఫలమున కెందున్. ౪౩

క. విను! పురుషుఁడు గావింపని
పనులకు దైవ మది యెట్లు ఫల మొనరించున్?
జనములు గార్యము నడుపఁగ
ననుకూలత నిచ్చుఁగాక యవ్వియె ఫలముల్. ౪౪

తే. పౌరుషమ్ము దైవంబు తోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర!

౧ పరుసు=విధము. ౨ జర=ముదిమి. ౩ స్రోతస్సు=ప్రవాహము. ౪ వీతబలుఁడు=బలహీనుఁడు. ౫ తిరుచు=లాగు. ౬ వారణేంద్రుఁడు=గజరాజు.

12

విత్తు సహకారి కాకున్న రిత్తనేల
వంధ్య మగుఁగాక తా ఫలవంత మగునె? ౪౫

క. అనలం బించుకయైనఁ బ
వనుచే వెలుగొందు మాడ్కి, వర్ధనముం బొం
దును సత్కర్మాచరణం
బున ౧ దైవము నానుకూల్యము గురుప్రవరా! ౪౬

కృష్ణ

చ. వినుము, జరానుబంధమున వెంద్రుక తండముఁ, బండ్లు, వీనులుం,
గనుఁగవయున్ జరంబొరయుఁ గాని యొకప్పుడుఁ దృష్ణ జీర్ణగా,
దనయముఁ జేర్చి ప్రాణముల నన్పక పోవనిరోగ, మల్పబు
ద్ధినరులు ౨ ద్రోవలే, రది మదిం జొరనీరు సుఖార్థులై బుధుల్. ౪౭

దుశ్శీలము

తే. సత్కులంబునఁ బుట్టుట సకలవేద
ములుఁ బురాణంబులును శాస్త్రములును జదువు
టయును సద్గతిఁ జేయఁ బ్రోథములు గావు
శీల సామాగ్రి లేని దుశ్చేష్టితునకు. ౪౮

ఆ. పలు సదువులు సదివి పండితమానియై
తనదు విద్య నొరుల ఘనయశంబుఁ
దూల పుచ్చునట్టి దుష్టాత్మకుని బ్రహ్మ
హత్య వొందు సందియంబు లేదు. ౪౯

అసమ కన్యాదానము

తే. రూప గుణశీలముల ననురూపుఁడైన
వరున కీక కన్నియఁ దన వలసినట్ల

౧ దైవము ఆనుకూల్యము=దైవముయొక్క అనుకూలత. ౨ త్రోవలేరు=త్రోసివేయజాలరు.

తగనివానికి నిచ్చుట ధర్మదేవ
తాతనూభవ! బ్రహ్మహత్యాసమంబు. ౫౦

తీర్థసేవ

క. విను, తీర్థసేవ గావం
బును గ్రోధము మదము లోభమును జేరని నె
మ్మనము గలిగి నడపవలయు
ననఘా! ఫలసిద్ధి దాన నగుఁ బురుషునకున్. ౫౧

క. దమమును దపము నహింసయు
శమమును ౧ దీర్థముల; ౨ వాన శౌచాతిశయం
బమల గుణ! కల్గు; రిత్తజ
లములం దోఁగినశుచిత్వలాభము గలదే? ౫౨

రహస్యము

తే. దినము, రాత్రియు, ఋతువులు, మనుజు చేయు
సుకృతమును దుష్కృతంబును జూచుచుండు,
గాన నెంత రహస్యంపుఁ గార్యమైన
నొరు లెఱుంగరు నన్నని యునికి ౩ మోస. ౫౩

సతి

క. పాతివ్రత్యము గలిగిన
నాతి యనఁగ దైవ మన జనస్తుత! వేఱే?
౪ యాతత ధర్మార్థ సుఖ
ఖ్యాతులు సద్భార్యవలనఁ గాదే కలుగున్. ౫౪

దానము

క. అర్థియైన దీనుఁడై తను
శరణంబని వేడినం బ్రసన్నాత్మత న

౧ తీర్థముల=తీర్థములే. ౨ వానన్=వానిచేతనే. ౩ మోస=మోసము. ౪ ఆతత=విరివియైన (అధికమైన)

ప్పూరుషుని కోరికఁ దీర్చిన
బురుషోత్తముఁడందు రతనిఁ బురుషవరేణ్యా! ౫౫

క. అడుగక యున్నను నాలిం
గొడుకుల రక్షింపలేక ౧ కుతిలపడుచు నె
వ్వఁడు బేదతనము గల నరు
౨ నెడ రుడుపఁగ వలయు నది మహితగుణ మనఘా! ౫౬

క. నిజదారపరులు సంతత
యజనరతులు గామరోష హంతలు నగు స
ద్ద్విజుల నరసి ధనమిచ్చుట
త్రిజగత్పూజ్య మగునంద్రు ధీరవిచారా! ౫౭

చ. అడిగిన నిచ్చుకంటెను నయాచకుఁగాఁగ నెఱింగి యిచ్చుటె
క్కుడు ఫలమిచ్చు; దానవిధికోవిద! వేఁడుటసావు, వేఁడగా
బడుటది పెద్దసావు, దగుప్రార్థన పూర్ణము సేయుఁ నాతఁ డా
యడిగిన వానిఁ దన్నును దయారతిఁ గావఁగ జాలువాఁడగున్. ౫౮

క. విను మొక కుంచెడు ధాన్యము
దన ౩ కాయతి గల్గునతఁడు దాని నొసఁగినన్
ధనకోటి గల్గువాఁడ
ద్ధన మొసఁగిన నొక్కరూప తత్తత్ఫలముల్. ౫౯

అహింస

ఆ. జంతు పదము లెల్ల దంతి పదంబులో
నడఁగు క్రియ, నహింసయందు సకల
ధర్మములు నడంగు; గర్మసంత్యాగికి
నైన భూతదయ సమర్హ్య గుణము. ౬౦

---

౧ కుతిలపడుచు=బాధపడుచు. ౨ ఎడరు=దుఃఖము. ౩ ఆయతి=రాఁబడి.

తే. వాజిమేధంబు కంటెను బూజనీయ
కర్మమందురు మాంసభక్షణము విడువు;
వినుము! చంపుటయును, జంపఁబనుచుటయును
కల్మషంబుల కెల్ల నగ్గలము లధిప! ౬౧

క. తను నమలిన వాని నమలు
నవి మాంసము తెలుఁగు సెప్పు నాగమములు; గా
వునఁ దద్భక్షణ ముడిగిన
ననఘ! తపంబునకుఁ జాలునది యొక్కండున్. ౬౨

క. జనవర! మాంసము చవి గడ
చిన చవు లరయంగ లేమిఁ జేసి చవి యెఱిం
గిన వాఁ డది యుడిగిన నా
తని దేవసమానుఁ డంద్రు ధర్మవిధిజ్ఞుల్. ౬౩

ఉ. మానను దాతనుం గలదె మాంసము ప్రాణుల దీనఁగాక, య
ట్లైనను నొంచునప్డు దమమేనులు సోఁకినమాత్ర నెట్లగున్
దానిఁ దలంపఁగావలదె? తానది మానిన హింసలన్నియున్
మానవె యంచు నుత్తముఁడు మాంసముమానుదయార్ద్రచిత్తుఁడై. ౬౪

ఆ. అన్య మాంసమున నిజాంగ మాంసంబు పో
షింతు ననుట కంటెఁ జెట్ట లేదు;
మాంస భక్షణంబు మానుటకంటెను
మేలు లేదు కర్మ జాలకమున. ౬౫

తే. ఆత్మ సదృశత ప్రాణభయంబు నందుఁ
బ్రాణులకు నెల్లఁ గని మాంస భక్షణంబు
మాను దయ నార్ద్రమానసుండైవ పురుషుఁ
డాతనికి బ్రహ్మలోకాదు లాటపట్టు. ౬౬

క. భూతముల కలుగు నతనికి
భూతము లఖిలములు నలుగు, భూతహితార్థీ!
భూతముల కభయ మిచ్చిన
పూతాత్మున కభయ మిచ్చు భూతావలియున్. ౬౭

ఆ. దానమును ధర్మంబు దపంబు యజ్ఞంబు
శౌచ మంత్ర తంత్ర సత్యములును
బుధు లహింస రూపములు గాఁగఁ జెప్పుట
నెల్ల కల్మి సు మ్మహింస కలిమి. ౬౮

గ్రహఫలము.

తే. * నాతి! విను, గ్రహచారంబు హేతువులుగ
నశుభములు శుభములు నరుఁ డాచరించు
గ్రహము సేయించునే తాన కాక ౧ చేతఁ
౨ కొడయుఁ డటు గాన ఫలములు గుడువవలయు. ౬౯

విద్యాదానము

తే. విద్య యిచ్చుట సత్పాత్ర విషయమైన
నవ్యయానందపదముఁ జేయంగ జాలుఁ;
దగఁగ దక్షిణ యిచ్చి పేదలకు విద్య
యీ నియోగించుటయుఁ దత్సమాన కృతియ. ౭౦

ధర్మములు

ఆ. ధర్మములకు సంజ్ఞ తద్వేదు లగు మహా
త్ములు దగంగఁ జెప్పుదురు నరేంద్ర!
వినుము కాలపాకమున నది ౩ యన్యథా
త్వంబు గలిగి ర యవిశదత్వ మొందు. ౭౧

* ఇది శివుఁడు పార్వతికి చెప్పినది. ౧ చేఁత=కర్మము. ౨ ఒడయఁడు= ప్రభువు (కర్త) ౩ అన్యథాత్వము=మార్పు అని భావము. అవిశదత్వము—అస్పష్టత.

క. అనఘ! యధర్మము ధర్మం
బను మతిఁ బుట్టించుఁ ౧ దృణ సమావృతమై ప్ర
న్నని తలము చందమునఁ దోఁ
చిన ౨ నూయింబోలె సూక్ష్మచిత్తత లేమిన్. ౭౨

క. ౩ శ్రుతముఁ బరిత్యాగముఁ గల
మతిమంతుల నడుగు లోభ మద మోహ సమా
వృత బుద్ధులు గాని సమం
చిత చరితుల వలనఁ దెలియు! శీలనిరూఢా! ౭౩

సాధులు

తే. సాధు లింద్రియవిభ్రాంతి సంహరింతు
౪ రఘముఁ దెలిసి ప్రాయశ్చిత్త మాచరింతు
రప్రకాశంబుగా ధర్మమాచరింతు
రఖిల భూత దయాళుత్వమారఁ గలరు. ౭౪

వివిధములు

క. పరదారగమన మొప్పదు
పురుషున కది యెల్ల పాపమున కంటె నరే
శ్వరవర! యాయుస్సంక్షయ
కరంబు దద్వర్జనంబు గడు మే లరయన్. ౭౫

తే. తగనియది యెద్దియైన వ్రతంబు పూని
మాన నోపిన నాయువు ౫ మాన్పకుండు;
నంతటన పోవ దాయు వత్యంత వృద్ధిఁ
జేయుఁ, దగినది సేసినఁ జెప్పనేల? ౭౬

తే. బహుళ మగు గర్వమునఁ గార్యభంగియును న
కార్య సరణియు నెఱుఁగ కనార్యవృత్తిఁ

---

౧ తృణసమావృతము=గడ్డిచే కప్పబడినది. ౨ నూయింబోలె=నూతివలె, ౩ శ్రుతము=పాండిత్యము, ౪ అఘము=పాపము. ౫ మాన్పక—పోగొట్టక.

గాని తెరువున నడచుచున్నని గురుని
నైన శాసింపఁగాఁ దగు నంద్రు బుధులు. ౭౭

క. తెగఁ దీర్చక తగ నార్చక
తెగటార్చక కడమ కొంత త్రిక్కఁగ నున్నన్
జగతీశ! యప్పు నగ్నియుఁ
బగయును గడుఁ బెరుగుఁ గీడు వాటిల్లుఁ దుదిన్. ౭౮

ఆ. మార్దవమున మృదువు మర్దింపగావచ్చు;
మార్దవమున ౧ఖర విమర్దనంబు
జెల్లు, మార్దవమునఁ జెల్లని యది లేదు;
గాన మృదువ తలఁప ఖరము సువ్వె. ౭౯

చ. తెవుళులు గొప్పవారి కవిదీరుట కౌషధ ౨మీఁగి, దుర్గతుల్
దవులు జనాళిఁ ౩బ్రోవు, సుపథంబుగఁ దైర్ధికకోటినన్ను బాం
ధవ రహితత్వ దీనశవదాహము, దుఃఖితు లైనవారిఁ దే
ర్ప వెరవు, నోర్పు గల్మియును బ్రస్తుతి కెక్కిన మేటిధర్మముల్. ౮౦



౧ ఖరము=తీక్ష్ణము, వాడి. ౨ ఈఁగి=ఇచ్చుట, ౩ ప్రోవు=రక్షణము,

# అనుబంధము



భీష్మపతనము విని ధృతరాష్ట్రుఁడు విలపించుట

సంజయుఁడు శోకావేశుండై ధృతరాష్ట్రుని పాదంబులం బడి భీష్మపాటు తెలుపుచు నిట్లని విలపించెను.

సీ. ఆప్తయోధుల కెల్ల నాధార మగునట్టి
తనకు శస్త్రంబు లాధారమయ్యెఁ;
పరశురామునకు మేల్సరి యైన తనయందుఁ
గలిగె భంగంబు శిఖండిచేత;
జనపతి దను ౧ నచ్చి మును జూద మొనరించెఁ
దాను గయ్యంపు జూదమున నోడెఁ;
దన యార్పు లెలుఁగునఁ ౨ దలఁకు వైరులు వొంగ
నోఱలుచు నేలకు నొఱగె నేఁడు;
ఆ. తీవ్రబాణజాలదీప్తులు పరఁగించి
పాండుతనయ సైన్య బహుళతమము
లీలఁ బదిదినంబు లోలి వినోదించి
యధిప! భీష్మభానుఁ డస్తమించె. ౧
క. పదివేవురు రాజులు దన
కెదిరి పొలిసి రా శిఖండి యేమిటి వాఁడై
తుదిఁ బోయి తన్ను నాజిం
గదియుచుఁ బొలియించె నియతిఁ గడవఁగ వశమే? ౨
తే. ౩ చాపవక్త్రుండు ౪ భల్ల దంష్ట్రా వితాన
ఘోరమూర్తి, ౫ నారాచనఖుండు, ౬ ఖడ్గ

---

౧ నచ్చి=నమ్మి. ౨ తలఁకు=భయపడు. ౩ చాపవక్త్రుఁడు=విల్లే ముఖముగాఁ ను. ౪ భల్ల...మూర్తి=బల్లెము లనెడు కోఱలపంక్తిచే భయంకరమైన యాకా వాడు. ౫ నారాచనఖుండు=బాణములను గోళ్లుగలవాడు. ౬ ఖడ్గ...భీష యను నాలుకచే భయంకరమైనవాడు.

జిహ్వాకాభీషణుఁడు, నరసింహామూర్తి
గాక కేవల నరుఁడె గంగాసుతుండు?

వ. అని సంజయుండు పలవించు పలుకులకుఁ జిత్తంబు జల్లని ౧ యొల్లంబోయి మూర్ఛిల్లి కొండొకసేపునకు ౨ శిశిర విధానంబుల సేదదేరి ధృతరాష్ట్రుండు కన్నీరు దొరంగ గద్గదకంఠుండై.

క. దేవాసురవరు లొక్కటి
యై వచ్చినఁ జిక్కువఱచు నాహవమున నా
దేవవ్రతుఁడు, శిఖండి శ
రావలి పాలయ్యె నేమి యనఁ గల దింకన్.

ఉ. అంచిత 3 తాలకేతు కిరణాళి మెఱుంగులు గాఁగ ౪ మౌర్విమ్రో
యించుట గర్జ చందముగ నేచి విరోధిదవానలంబు మా
యించు శితాస్త్రవర్షమున నిట్టిది ౫ భీష్మమహాభ్ర మెట్లడం
గించెనొకో శిఖండి యను కృత్రిమవాయువుదాకి దైవమా.

తే. పెరిగి పాండవాంబుధి వెల్లి విరిసినపుడు
నిలువ నిమ్మగుదీవిగా నిన్నుఁ దలఁచి
యుండ నత్యంత తుచ్ఛ ౬ శిఖండి పల్వ
లాక్రమంబున మునిఁగితే? యకట! తండ్రి!

ఉ. వీరరసాంబుపూరమున, విశ్రుతి ౭ బాహుమహోగ్రసత్త్వముం
౮ జారుగదాధ్వజాచలవిశాలము, ౯ నంబకజాలవీచికా
స్ఫారము నైన భీష్ముఁ డను సాగరముం గడవంగ నీఁదఁగా
౧౦ నేరిమి యెట్లొకో గలుగనేర్చె శిఖండికి నేమి సేయుదున్.

---

౧ ఒల్లంబోయి=వాడి. ౨ శిశిరవిధానము=శీతలోపచారము. 3 తాలకే
తాళవృక్షధ్వజము యొక్క. ౪ మౌర్వి=వింటిత్రాడు. ౫ భీష్మమహాభ్రము=భీష్ము
పెద్దమేఘము. ౬ శిఖండి పల్వలము=శిఖండి యను నీటిగుంట. ౭ బాహు.
ము=బాహువులను భీకర జంతువులు గలది. ౮ చారు...విశాలము=గ
యు జండాయు ననెడి కొండలచే విరివియైనది. ౯ అంబక...స్ఫా
మూహమనెడు కెరటములయొక్క కదలిక గలది. ౧౦ నేరిమి=నేర్పు